సరస్వతీ గ్రంథమండలి

# మునిమాణిక్యం నాటికలు

(1 జయమ్మ కాపరం. 2 ఎలోట్మెంట్లు.)

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు
బి. ఏ., యల్. టి.




ప్రతులకు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# ప్రకాశకుల కృతజ్ఞత

విఖ్యాతకథానికారచయిత శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు, తాము రచించియున్న 1. నేనూ మా కాంతం, 2. కాంతం కైఫీయతు, 3. మునిమాణిక్యం కథలు, 4. మునిమాణిక్యం నాటికలు, 5. కాంతం కాపరం, 6. ఉపాధ్యాయుడు, 7. మేరీ కహానీ, 8. తిరుమాళిగ అనే గ్రంథము లెనిమిదిన్నీ, మా ప్రకటనశాఖ యెడల తమకుగల ఆదరాభిమానములతో, అయిదు సంవత్సరములవరకును మేము మాత్రమే ప్రకటించుకొనే హక్కు మాకు దయచేసియున్నారు. ఇందుకు, వారికి మే మెంతయు కృతజ్ఞులము. అవన్నియు వెన్వెంటనే మేము ప్రకటింపబూనుకొన్నాము

దొరబాబు అనే పుస్తకములో ఉన్న మూడుకథలు యీపై 1, 5 పుస్తకాలలో చేరిపోయినవి.

మరిన్నీ, ఇదివరకే వారు సర్వాధికారములతోను మాకు దయచేసియుండిన "కాంతం కథలు" అనే గ్రంథమును, ఇప్పుడిప్పుడే మేము రెండవకూర్పు ప్రకటించి ఆంధ్రమహాజనులకు నివాళించుకొనియున్నాము.

రాజమండ్రి
28 జనవరి 1947

ప్రొప్రయిటరు
సరస్వతీ పవర్ ప్రెస్

Saraswathi Power Press, Rajahmundry
Printed and published by
A. Lakshmanaswamy Naidu
For Addepally & Co, Educational Publishers
1st Edition 1947 No. 4230/1947

# జయమ్మకాపురం

---

## ప్రథమాంకం — ప్రథమరంగం

(జయమ్మ పుట్టినిల్లు పెద్దబజారులో ఇల్లు ఇంటికి ముందున్న పోర్టికోలో, అక్కచెల్లెండ్రు, మీనా జయానూ వాళ్లతల్లి శాంతమ్మానూ కూర్చుని మాట్లాడుకుంటూ వుంటారు)

జయ — అమ్మా. ఏదైనా మంచి పాట పాడవే.

శాంతమ్మ — నాకేం పాటలొచ్చే పిచ్చితల్లీ చిన్నప్పుడు నేర్చుకొన్నవి ఏమైనా వచ్చినా, అవన్నీ పాతపాటలు. ! పాతపాటలు నచ్చుతాయమ్మా మీకూ ?

జయ — నచ్చకేమి ! అవే బాగుంటయి నిజానికి!

మీనా — ఆ నచ్చుతై ! నచ్చకేం నీకన్నీ నచ్చుతై. పాతచింతకాయ పచ్చడైనా కమ్మగానే ఉంటుందినీకు. ! !

జయ — పోనీ నీవు పాడరాదమ్మా ఏదైనా కొత్తపాట?

మీనా — నాకు ఇంగ్లీషు పాట వచ్చు

శాంతమ్మ — పోనీ అదే పాడు వింటాము ఏదైతేనేం పాడటానికి ?

జయ — పాడవే.

మీనా — పాడతాను విను.

**There are ten green bottles hanging on the wall**
**Hanging on the wall**
**If one green bottle happens to fall**
**There are still nine green bottles hanging on the wall.**

(శాంతమ్మ తెల్లబోయిచూస్తూ ఉంటుంది. జయ విని విరగబడి నవ్వుతుంది)

జయ — ఇదేం పాటే ?

శాంతమ్మ — ఇప్పుడు నీవు...పాడింది పాటలేఁ అమ్మాయీ ! !

జయ — పాటేనే ... (నవ్వి) ... ఇంగ్లీషు పాటలు అల్లాగే ఉంటై ......ఇకచాలుగాని అమ్మా అధ్యాత్మరామాయణ కీర్తన ఒకటిపాడవే.

శాంతమ్మ — దానికేంభాగ్యం... పాడతా నమ్మా...
(కృష్ణుని చల్దులు పాడుతూఉంటుంది).

మీనా — అమ్మా...అమ్మా...పోస్టుమన్ వస్తున్నాడే!! ఉత్తరం ఏమైనా ఉందేమో ! మాస్టరు గారింటికి వెళ్ళాడే అమ్మా. మనకేమైనా ఉత్తరం ఉందేమో అడగనా ?

శాంతమ్మ — పిచ్చా ఏమిటే నీకూ? మనకిప్పుడు ఎవరు వ్రాస్తూరె ! అక్కయ్య కూడా ఇక్కడే ఉందాయె !!

మీనా — (కొంటెగాచూస్తూ) ఏమె జయక్కా ? ఎక్కడ నుంచి అయినా ఉత్తరం రావాలా ?

జయ — (సిగ్గుపడి) ఏమోనే నన్నడిగితే నాకేం తెలుస్తుందే !

మీనా — అబ్బ ! ఎంతసంగనాచివే ! ! బావ దగ్గరనుంచి ఉత్తరం వస్తుందే మోనని నీవు అనుకోలా !! నవ్వుతుంది పైగా ! అమ్మా చూడవే ఎట్లా నవ్వుకొంటున్నదో...... నా మాట అబద్ధమేమో! !

శాంతమ్మ — పోనీ లేవే......అల్లరి చేయకూ.

జయ — వెళ్ళి పోయినాడా ?

మీనా — పోయినట్లే ...ఉన్నాడు — ( సందేహంగా) అనుకో......వస్తున్నాడు ! ! ఉత్తరం ఏమైనా ఉందేమో అడగనా ?

శాంతమ్మ — అడగటం ఎందుకే ? ఉత్తరం ఏదేనా ఉంటే అతనే ఇచ్చిపోతాడు ! వట్టి కేళ్తాడా ?

మీనా — (ఎగురుతూ) ఇటే వస్తున్నాడు !
(జయ లేచిచూస్తుంది) మన ఇంటికే! నవ్వుతున్నాడు కూడానూ! అమ్మా. అమ్మా. రావే. రావే ఏమే అమ్మా మనఇంటికే వస్తున్నాడే ! !

శాంతమ్మ — రానీయవే! ! ఎందుకట్లా ఎగురుతావు!!

మీనా — ఏం అబ్బాయి, మాకేనా ఉత్తరం ?.. నే జెప్పలా ? నాకు తెలుసూ! ఇది బావ రాసిందేనా అక్కయ్యా! !

జయ — ఇల్లా...ఇయ్యి (అని ఉత్తరం లాక్కోబోతుంది. మీనా పారిపోతుంది)

మీనా — ఆ ... నే నియ్యను ... అమ్మా బావ-
రాసిందేనే !...

శాంతమ్మ — నీకెల్లా తెలుసే ఎవరు వ్రాసిందీనీ...ఒక వేళ మీ నాన్నగారి ఉత్తర మేమో చింపబోకు సుమీ

మీనా — (అడ్రసుచూస్తూ) ఆశ్చర్యంగా నాన్న పేరుందే !!

శాంతమ్మ — అయితే బల్ల మీద పెట్టే శెయ్యి

జయ — (తెల్లపోయి) నాన్నదా ?

మీనా — (లేగదూడలాగ ఛంగున గంతేసి) కాదేవ్. అమ్మా నాన్నగారి కేరాఫ్ జయలక్ష్మి అని ఉందే !! అక్కయ్యకేనే ! ఇకేం ! బావరాసిందేనే ! నే జెప్పలా ?

జయ — (సంతోషంతో) ఇల్లా ఇయ్యి అల్లరి చెయ్యక- (అని మీనచేతిలోనుంచి ఉత్తరం లాక్కోబోతుంది. మీనా అందకుండా పరుగెత్తుతుంది)

మీనా — ఇందవే...నాకెందుకు నీ ఉత్తరం. (అని నిలబడుతుంది. జయ అందుకుంటానికి వెళ్ళగానే) అమ్మా ఎంతాశే ! (అని దూరంగా నుంచుని ఎగురుతుంది సంతోషంతో)

శాంతమ్మ — మీనా, ఏమిటా ఎగురుడూ ? దాని మొగుడు వ్రాసిన ఉత్తరం అంటే. దానికి ఆశ గదూ !

మీనా — ఆశేలే...... చింపనా...చింపుతా

శాంతమ్మ — అక్కయ్య కియ్యవే మీనమ్మతల్లీ

మీనా — చింపుతున్నానేవ్ ...... చింపు ...... తు ...... న్నా ...... ను ...... (చింపబోతున్నట్లు

నటిస్తుంది)

జయ — వద్దని నీకు కాదూ చెప్పేది? ఇల్లా ఇస్తావా ఇయ్యవా! (మీనా పాలుతాగిన ఆవుదూడలాగ గంతులేస్తుంది. జయ నిలబడి చూస్తుంటుంది)

మీనా — నీ మొగుడు వ్రాసిన ఉత్తరం అయితే మటుకు ఎందుకమ్మా అంత ఆశా?

శాంతమ్మ — నీకూ మొగుడు వస్తేగాని తెలియదు, ఆ ఆశ ఏమిటో! నీవు చించి చూడ కూడదమ్మా అక్కయ్యకు ఇచ్చెయ్యి.

జయ — ఇల్లా ఇచ్చెయ్యి మా అమ్మగదూ

మీనా — (తల్లిదగ్గరకువచ్చి) నేను చదువుతానే అమ్మా. (తగ్గుగొంతుకతో)

శాంతమ్మ — అక్కయ్యకు ఇచ్చెయ్యి అని చెప్పానా ...ఎందుకు చెప్పానో...వినాలె. (బతిమిలాడుతుంది)

మీనా — ఇందవే.....నీ మొగుడు వ్రాసిన ఉత్తరం నీవే చదువుకో నాకేం వద్దులే అమ్మా (అని ఇయ్యబోతుంది)

జయ — (అందుకోబోతే...మీనా...ఇస్తున్నట్లు నటించి చెయ్యి వెనక్కి లాక్కుంటుంది అమ్మాఅంటూ) అబ్బ, వడ్డింపు చుకు తింటున్నావు! పోనీ నీవే చదవ్వే.

మీనా — (బుద్ధిమంతురాలై సీరియస్‌గా) నీ మొగుడు రాశాడుగా నువ్వేచదువుకో. ఇందమ్మ నీ ఉత్తరం: (బుడ్డ మూతితో ఇచ్చేస్తుంది)

౨

(అదే స్థలం. జయ ఉత్తరాన్ని అందుకొని ఒకమూలగా ఒదిగి కూర్చుని, జాగ్రత్తగా, నెమ్మదిగా చింపి, ఉత్తరాన్ని తీసి చదువుకోటం ప్రారంభిస్తుంది. శాంతమ్మ కుమార్తె వంక తదేక దీక్షతో చూస్తూ, సంతోషిస్తూంటుంది.

ఉత్తరంలో మొదటిపంక్తి చదివే సరికే జయకు అప్రయత్నంగా నవ్వు వస్తుంది. దీక్షగా ఉత్తరం చదువుకొంటూ ఉంటుంది.

మీన మెల్లగా జయవెనక వైపునకు జేరి మోకాళ్ళ మీద కూలబడి, జయ బుజాల మీదుగా చూస్తుంది. ఆ ఉత్తరం చూసి ఆశ్చర్య పడుతుంది. ఏదో రహస్యమైన సంగతి తెలుసుకొన్న దానిలాగ చూస్తుంది. కళ్లు పెద్దవి చేస్తుంది. పెదవి లోపలకి లాగి పడుతుంది. ఏదో అద్భుతమైన, విచిత్రమైన రహస్యాన్ని తాను సంపాదించి నందులకు పట్టరాని సంతోషంతో, మెల్లగా లేచి, అడుగులో అడుగు వేసుకొంటూ నడచివెళ్ళి తల్లిచెవిలో ఏమో చెపుతుంది ఆమె నవ్వుతుంది.

మీన మళ్ళీ జయక్క వెనకాలచేరి ఇందాకటి మాదిరిగా చూడాలని ప్రయత్నం చేస్తుంది. కాని ఈమారు జయ ఉత్తరాన్ని దాచుకొని, మీనకు కనపడని పద్ధతితో చదువుకొంటూఉంటుంది మీన చిన్నపుచ్చుకొని జయ తనను అవమానపరచి నందులకు కోపంగా ఉంటుంది.

కాసేపు అయిన తరువాత మీనా తల్లి దగ్గరకెళ్ళి, మళ్ళీ ఏదో చెప్పాలన్న ప్రయత్నంలో అమ్మా, అమ్మాఅని గడ్డం మునివ్రేళ్ళతో నెట్టుతుంది. శాంతమ్మ వినిపించుకోకుండా జయమ్మ ఉత్తరాన్ని చదువుకోటంచూచి ఆనందిస్తూఉంటుంది. మీనా ఊరుకోదు. పీకి పీకి ఆమెదృష్టి తనవైపుకు త్రిప్పి, మళ్ళీ చెవులో "ప్రియమైన జయకేఅమ్మా" అంటుంది)

మీనా — ఉత్తరం చూడ నీయవు కదూ...

నే చూశాలే ...... అమ్మా ... ప్రియమైన జయకే! (నవ్వుతుంది)

శాంతమ్మ — సరే. చెప్పావుగా అమ్మా.

మీనా — (మరుసారి ఉత్తంచూడాలని ప్రయత్నించేసి) పో నీలే అమ్మా నాకు చూపొద్దులే. నేను అసలు చూడనే చూడనూ!(బుడ్డమూతిపెడుతుంది. ప్రియమైన జయకు...ప్రియమైన జయకు...(అనేక రకాలుగా నొక్కి సాగదీసి ఆమాటలో ఉండె మాధుర్యానంతా వలకపోస్తుంది)

ఒక అమ్మాయి మొగుడు ఏమన్నా.............పెళ్ళానికే......(నవ్వు.)- "ప్రియమైన జయా" అని ఉత్తరం రాశాడు.

రత్తమ్మ — (ఇంటిప్రక్కఆవిడ. ముసలిముత్తైదువ. వస్తుంది) ఏమమ్మా శాంతమ్మ వదినా...ఏమిటి సంగతి?

శాంతమ్మ — రా వదినా...రా...మరేం సంగతులు లేవు...

రత్తమ్మ — మీనా ఎందుకూ అట్లా ఎగురుతుంది?

మీనా — ఏం లేదు అత్తయ్యా ................. ఒకమ్మాయి మొగుడూ.........(నవ్వు)

రత్తమ్మ — ఎందుకే అంత నవ్వూ?

జయ — దాని సంగతి ఎరగవు అత్తయ్యా అది అంతే!

శాంతమ్మ — దాని మొగుడు ఉత్తరం వ్రాశాడు; అది చదువుకొంటున్నది. అదీసంగతి అంతకంటే మరేంలేదు.

రత్తమ్మ — దాని మొగుడు వ్రాసిన ఉత్తరం అది చదువుకొంటూంటె...ఇదెందుకూ ఇట్లా ఎగురుతుందీ!

మీనా — అదిగాదు...అత్తయ్యా...(నవ్వుఆపుకో లేక విరగబడి నవ్వుతుంది)

రత్తమ్మ — ఏమిటే...పిచ్చి పిల్లా...సంగతేమిటో చెప్పి మరీనవ్వూ.

మీనా — అదికాదు అత్తయ్యా...బావే...అక్కయ్యకు ఉత్తరం వ్రాశాడు-(మళ్లీనవ్వుతుంది)

రత్తమ్మ — రాస్తేఏం? మొగుడు పెళ్ళానికి ఉత్తరం రాసుకోట్టే! ఎందుకానవ్వూ?

మీనా — ఉత్తరానికి కాదు అత్తయ్యా...మరిటా...... (నవ్వు)...పెళ్ళాంటా......ప్రియమైన జయటా!! (పక్కలు పట్టుకొని విరగబడి నవ్వుతుంది)

రత్తమ్మ — ఓస్......ఇంతేగద! అబ్బరమూ ఏమిటి? ఈమాత్రానికే ఎందుకే అంత ఎగురుడూ? నీకూ వస్తాడుండు

...వెక్కిరిస్తూన్నావు ! నీ మొగుడు ఏం రాస్తాడో ఆలోచించుకో!

మీనా — నాకు మొగుడు లేడుగా!

రత్తమ్మ — లేకపోతే రేపి పాటికి వస్తాడు. వచ్చీ......

మీనా — ఆ...వచ్చీ......వచ్చి ఏం జేస్తాడు? చెప్పు?

రత్తమ్మ -- ఆఁ వచ్చి ఏం జేస్తాడా? వచ్చి మత్తగా తంతాడు...సరేనా?

మీనా — అట్లాయితే... నేను...అసలు పెండ్లి చేసుకోనుగా

రత్తమ్మ — నూచక్కా చేసుకోంటావు! నీవుచేసు కోంటావా నీతల్లో జేజెమ్మచేసు కోంటుందా!

మీనా — ఆ...చూద్దాం..."వలదు...వలదు. వివాహంబు వలదు నాకు పిద్యాలందే సుఖము వెలయునాకు"

రాదే...చెలీ

నమ్మరాదే చెలీ

మగవారిని...నమ్మరాదే చెలీ (అంటూ పరుగెత్తిపోతుంది.)

శాంతమ్మ — నీకొడుక్కు చేసుకోవమ్మాదీన్ని.!

రత్తమ్మ — నా కొడుక్కు చేసుకోంటే... ఈగడుగ్గాయ సరగ్గా కాపురం చేస్తుందనే నీవనటం! ఇప్పుడే ఇట్లా ఎగురుతున్నదే గజ్జల గుఱ్ఱంలాగ? ఈడొస్తే ఇమానిఁుస్తుందంటా? వాణ్ణి కాఁకి అమ్ముకొస్తుంది గాని! సరేగాని ఇంతకూ అల్లుడు ఏం రాసినట్లు?

శాంతమ్మ — ఏదీ—? ఏమమ్మాజయా...ఏం రాశాడే? మేము వినొచ్చా? (అని పక్కావిడను చూచి నవ్వుతుంది)

రత్తమ్మ — పోసి...ఉత్తరం...అంతా చదవొద్దులే అమ్మా...సంగతు లేమిటో చెప్పు. అంతే చాలు సంతోషిస్తాను.

జయ — (నవ్వుముఖంతో) పెద్ద రహస్యాలు ఇందులో ఏమీ లేవే...అమ్మా నువ్వేచూడు. (ఉత్తరం తల్లికి స్తుంది.)

శాంతమ్మ — (ఉత్తరాన్ని తలక్రిందుగాపెట్టిచూచి) అంహా అక్షరాలు అలికేసి నట్లుగా ఉన్నాయి. నీవుచదువు వాద్దినా... వింటానూ.

రత్తమ్మ — (బారెడుదూరంలోపెట్టి) అంహా నాకూ చూపు ఆనటంలేదు. కళ్లజోడుకావాలె. ఎందుకాని ఇదంతానూ నువ్వేచదవ్వే ... జయమ్మా ... (అని ఉత్తరం జయచేతికిస్తుంది)

మీన — (ప్రవేశించి) — నేనుచదువుతాను పోసి ఇల్లా ఇయ్యి ఉత్తరం అత్తయ్యా.

శాంతమ్మ — కాదులే అమ్మా ... దాన్నే చదవనీ నువ్వు ఇల్లారా. తల్లీ ...నాదగ్గరకూర్చో. అక్కయ్య చదువుతుంటే అంచక్కావిను. ఇహా చదువు తల్లీ. చదవ్వే, సిగ్గేమిటి?

రత్తమ్మ — ఓయబ్బ! ... ఏంసిగ్గమ్మా! చదువమ్మా వింటాను.

జయ — సిగ్గుకాదే ... చదువుతానే అమ్మా విను మరి ఆవిడతో గుసగుస లాడతావేం ... ?

శాంతమ్మ — ఉఁలేదులే ... కానీయ్

జయ — మీరిద్దరూ అల్లాగ ముసిముసి నవ్వులు ...... నవ్వుతూంటే ... నేనేంచదివేదే!!

రత్తమ్మ — లేదు లేవమ్మా — ఊగుళో వదినా ఊ. కానీ.

జయ —(సిగ్గుపడి) నేను ...............(నవ్వుతుంది)

శాంతమ్మ —(అంతానవ్వుతారు.) ... నువ్వేనవ్వుతుంటివి! చప్పున చదివే శెయ్యి...... ఏముందేంమహాభాగ్యం!!

జయ —(ఉత్తరంచదువుతుంది) "నేను ఇక్కడ కులాసాగా ఉన్నాను"

మీనా —(వేచి) ఆఁ ఆఁ అది చదవ్వేం మొదట్లో వ్రాసింది!

రత్త — మొదట్లో వ్రాసిందేమిటే! ... పోనీ అదికూడా చదువు వింటాం.

మీనా — మొదట్లో, ప్రియమైనజయాఅని వ్రాయలా... (మళ్ళీనవ్వు)

శాంతమ్మ — అది విన్నాంగా ఇఁహచదవనీ.

మీనా — ఇహ చదవ్వే ... (వెక్కిరింతగా)

జయ — నేను ఇక్కడ కులాసాగాఉన్నానుఁ మాఅమ్మా నాన్నా గుంటూరు వెళ్లారు. మా అక్కయ్యకు పురుడు వెళ్లిం తరువాత వస్తారుట.!

శాంతమ్మ — ఎప్పుడో ప్పుడు వస్తారు. ... ఇందులో ఏముందే ... అల్లాగనవ్వుతారు. ఏమమ్మా వదినా ఎందుకూఅల్లా నవ్వుతారూ!

రత్తమ్మ — ఏదో పిచ్చిపిల్లలు. ఊఁఇంకేంరాశాడే ... జయా ... చదువు మరీ.

జయ — "నేను హోటల్లో భోజనం చేస్తున్నాను."

శాంతమ్మ — ఇంకా ఇబ్బంది ఏముందీ!... ఏమమ్మా! హాయిగా హోటల్లో భోజనం చేస్తాడు! ఏమంటావు!

జయ — హోటలు భోజనం నాకేమీ నసిగాలేదు. (అని ఘక్కున నవ్వుతుంది)

శాంతమ్మ — ఎందుకే ఆ నవ్వు... అంతా నవ్వుతున్నారే! ఏముందమ్మా ఇందులో!!

మీనా — (తల్లిబుగ్గమీద పొడిచి) నీకేం. అర్థంకాదు. బావ ఉత్తరంలో మొదట- మూడాన్న అమ్మాయిగారూ అని వ్రాయలే.

శాంతమ్మ — వ్రాస్తే?

మీనా — వ్రాస్తే నేను ఒక్కణ్ణే ఉండలేనూ...నీవు చప్పనరా అన్న మాట!

శాంతమ్మ — (ముక్కుపై వేలేసుకొని) అల్లాగటే!

మీనా — అందుకని హోటలు భోజనం నసిగా లేదు

శాంతమ్మ — అందుకని భోజనం నసిగా లేక పోవటం ఏమిటే.

మీనా — నీతలకాయ. నీకేం అర్థంగాదు. హోటళ్లలో అన్నం నయించటం లేదూ అంటే ఏమిటి?

శాంతమ్మ — ఏముందే?

మీనా — అక్కయ్య వెళ్లీ...వండిపెడితే గాని...ఆయనకు ...అన్నం...నయించదట!! ఇప్పుడు తెలిసిందా?

శాంతమ్మ — నాతల్లే, ఎంతఅర్థం ఉందే!! నాకేం తెలుస్తాయమ్మా ఈ అర్థాలన్నీనూ? నే నేమన్నా చదువు

కొన్నానా, పెట్టానా ?

మీనా — దీనికేం చదువు అక్కర్లేదే ఇది కావాలె. (నెత్తిమీద కొట్టుకుంటుంది)

శాంతమ్మ — నాకు అదీ లేదూ...ఇదీ లేదూ...జయమ్మా ...ఇంకా ఏమన్నా ఉందా అయిపోయిందా...ఉత్తరం ?

జయ — ఇంకా రెండు ముక్కలున్నాయ్ "పాలపున్నమ్మ కు ఎంత ఇవ్వాల్సింది నాకు తెలియదు. అది డబ్బుకోసం రోజు రోజూ తిరిగి పోతున్నది."

శాంతమ్మ — పాలపున్నమ్మ సంగతి ఎందుకమ్మా ఈ ఉత్తరంలో ?

జయ — ఆ పాలుదానికి ఎంత ఇవ్వాలో ఆయనకు తెలియదు! అది రోజురోజూ లెఖ్ఖకు గోలచేస్తున్నది కామోసు!!

శాంతమ్మ — ఏం విచిత్రమమ్మా, లెఖ్ఖజూచుకొని ఇచ్చి పంపలేదూ ?

రత్తమ్మ — నీదంతా ఓ వెర్రిగొడవా !! గ్రహించ లేవూ? అదో నెపము !!

మీనా — జయక్క వెళ్ళి లెఖ్ఖచూస్తేనేగాని తేలదు ఆ చిక్కు. అదీ సంగతి !! తెలిసిందా ?

రత్తమ్మ — ఇప్పుడు తెలిసిందమ్మా. ఈ ఉత్తరంలో సంగతంతా ఏమిటంటే...పెళ్లాన్ని తత్ క్షణం తిరుగుటపాలో పంపమని.

మీనా — అక్కయ్యను తిరుగుటపాలో పంపెయ్యవే

అన్నా. అదికూడా ఆలస్యం కావచ్చు: కుర్రగాంమీద పంపేద్దాము అక్కయ్యని !!

జయ — (కోపం నటిస్తూ) మీనా, ఏమిటదీ ?

శాంతమ్మ — అంతేనుటే జయమ్మా అర్థం.

రత్తమ్మ — దాన్ని అడగాలటే ... తెలియటంలా ? (నవ్వు) హోటలులో భోజనం సరిగా లేదంటే అర్థం తెలియటం లేదటమ్మా వదినా ? (నవ్వు)

జయ — కాదులే...అత్తయ్యా ఆయనకు నిజంగా హోటలు భోజనం పడదు.

మీన — అత్తయ్యా...ఇప్పుడు తెలిసిందా? జయక్క మాట విన్నావా? దీనికీ ప్రేమేనే మొగుడంటే...ప్రియమైన మొగుడు! (వెక్కిరిస్తుంది)

శాంతమ్మ — ఈ డొంక తిరుగుడు అంతా ఎందుకమ్మా! పోనీ...నీవు వెంటనే బయలు దేరిరా...అం ప్రాయకూడదూ?

రత్తమ్మ — నీదంతా ఓగోడవ అల్లారాస్తాగుటమ్మా ఇప్పటి కాలం కుఱ్ఱవాళ్ళు అయితే మటుకు సాంప్రదాయంలో పెరిగిన వాళ్ళు ఇల్లాగే వ్రాస్తారు వదినా!

శాంతమ్మ — చాలా తమాషాగా వ్రాశాడు! గొప్ప అల్లుడే! ఉత్తరం అయిపోయిందా అమ్మాయీ!

జయ — అయిపోయినట్లే. ఇంకా రెండు ముక్కలున్నాయి.

రత్తమ్మ — అవీకూడా వినిపించవే జయా. ఇంకా ఏమి

తమాషాలున్న దొయ్యా!!

జయ — తమాషాలు ఏమీ లేవు! అత్తగారికి మామగారికి నమస్కారములు మామరదల్ని చి॥ మీనాక్షిని చూడాలని ఉంది. చిన్నప్పటి దాని ముద్దుమాటలు జ్ఞాపకం వస్తూ ఉంటాయ్

శాంతమ్మ — ఈభాష నాకూ అర్థం అవుతున్నది. అయితే దాన్ని కూడా తీసుకుని రమ్మనా ఆయన అనటం?!

మీన — అది! అమ్మయ్యా...మాఅమ్మకు ఇప్పుడిప్పుడే తెలుస్తున్నాయి సంగతులు!!

రత్తమ్మ — ఒక వేళ మీరేమన్నా అటంకం చెబుతారని నమస్కారాలు కూడా పారేశాడు.

శాంతమ్మ — తమాషాగా ఉందే. అల్లుడు గడుసు వాడు సుమీ. (నవ్వుతూ) హోటల్ భోజనం పడటం లేదూ? పాల లెక్క చూడటం కూడా తెలియదు పాపం!!

జయ — కాదులే...అమ్మా...ఆయనకు నిజంగా తెలియదు. ఇటువంటిగొడవ లేమీ పట్టించు కోరు. అంతానేనే!!

రత్తమ్మ — ఇంకెందు కమ్మా ... దీని సంగతికూడా తెలియాలా ఈ మాటలో!!

శాంతమ్మ — ఇంకా తెలియకుండా ఉండాల్సిందే!! అంతా తెలిసింది. సరేలే...మీనాన్నరానీ ... రేపేకామాలు దశిమి ...సరే జయా ... ... రేపేబాగుంది.

మీన — (దీర్ఘాలుతీస్తూ)నేను ... కూడా ... వెడతానూ

శాంతమ్మ — దాని మొగుడింటికి నీవెందుకే ?

జయ — ఎక్కడా మొగుడు దొరక్కపోతే అక్క మొగుడే దిక్కు అన్నారు.

మీనా — నాకు మొగుడు దొరక్కేమి ? నేతల్లెక్కొంటే ...ఒక్కటి ... రెండు మూడు ...ముగ్గురు మొగుళ్లున్నారు నాకు ... (వేళ్లమీద లెక్కపెడుతుంది)

రత్తమ్మ — ఎంత గడుసేదది !

జయ — మీనా. వెళ్లుగాంగా.

శాంతమ్మ — సరే... అక్కయ్యానీవూ బట్టలుసర్దుకోండి.

జయ — (ఉత్తరాన్ని రవికజేబులో పెట్టుకొని) (తావే మీనా వెళ్లిపోతారు)

శాంతమ్మ — జయమ్మ చూశావా వదినా! దానికి వెళ్ళాలని ఉంది !!

రత్తమ్మ — ఇంత వెర్రిదానవే నువమ్మా ఉండదు టమ్మా.

శాంతమ్మ — ఉంటుంది. ఉంటుంది. ఏదో కన్న కడుపుకా బట్టి ...(రుద్ధకంఠం) అమ్మాయి మళ్ళీ అత్తవారింటికి వెడుతుంది అంటే కష్టంగా ఉంటుంది.

రత్తమ్మ — ఏమిటి వదినా. (కన్నీరు) ఆడపిల్లలను కన్నాం.. ఒక అయ్యచేతులో పెట్టాం. ఇక మన దేముంది చెప్పు ! అయినా దానికేంతక్కువ ! అత్తవారింట్లో అయినా అదిఒక పనీ పాటా చేయక్కర్లేదు. జమీందారు బిడ్డలాగు గడుస్తుంది.

శాంతమ్మ — దానికేం తక్కువ వదినా. ఆ అత్తగారై

నా, ఏమాట కామాటె చెప్పాలె ... పార్వతీ దేవి లాంటిది. కోడల్ని ఇవతల చెంబు అవతల పెట్టనియ్యదు. కొడుకూ కోడలూ చిలకాగోరంకులా ఉంటే చూచి సంతోషిస్తుంది.

రత్తమ్మ —అదే మనకు కావల్సింది! జయమ్మ కడుపు ఫలించి నాలుగు పూలూ నాలుగు కాయలూ కాస్తే...

శాంతమ్మ — ఆఁ .అంతే.....వదినా...అంతే అంతకంటే కావల్సిందేమిటి !

రత్తమ్మ —(తగ్గు గొంతుకతో) అవునుగాని ... వదినా ఏమన్నా ? .........

శాంతమ్మ — ఏచ్చే ... ...ఏదీ ... ...

## రెండవ రంగం

[పడకగది. ఒకపక్కగా ఒకబల్ల దానిపై నిఘంటుకాలు చిందరవందరగా పడేసి ఉంటై. ఏవస్తువూ ఉండవలసినచోట ఉండదు. బాబుఆగదిలో ఒంటరిగాఉంటాడు. బాబు జయమ్మభర్త. మోచేతులు వరకు ఉన్నచొక్కా. కొంచెంవిసుగ్గా, విచారంగా ఉంటాడు. ఇంతలోకిచాకలిది వస్తుంది.]

చాకలి — బాబయ్యా.

బాబు — ఆ... ఎవరూ ? నీవా...చాకలీ... బట్టలు తెచ్చావా...రా.

చాకలి — తెచ్చానండి బాబయ్యా... పద్దుచూస్తే...

వ్రాసి ప్రకారం అప్ప జెపుతానండి.

బాబు — అదే... అదే చూస్తున్నానే ఎక్కడా కనపించటంలేదు...ఎక్కడ పెట్టేస్తింటో ఆమహారాణీ! ఇంటికొక్కిన ఆవిడ లేకపోతే చూశావ్రా ... చాకలీ... వస్తువొక్క కనపడదు....

చాకలి — అంతేనండి బాబయ్యా. మొగోరికేం కనపడ తైయండీ, ఆడోరు పెట్టిన వస్తువులు.

బాబు — (పుస్తకాలూ అవీ బల్లమీద నుంచి క్రింద పడేసి) ఉహూ కనపడలేదు. అయితేనాకు చాకలీ ఎక్కడ పెడ తుందే పుస్తకం మీ అమ్మగారూ ?

చాకలి — పరుపు కింద సూడండి బాబయ్యా

బాబు — అవునవునేవ్ ...(పరుపుఎత్తిక్రింద పడేసి) ఏదీ? ఇక్కడాలేదు ఇహ నేను వెదకలేను గాని, ఆ బట్టలు ఎక్కడ పెట్టేళ్ళు మీ అమ్మగారొచ్చి, లెక్ఖ జూచుకొంటుంది.

చాకలి — ఎందుకండీ బాబయ్యా, వంటింట్లో సూడిరండి

బాబు — అక్కడ కూడా చూసి వస్తానుండు. అయినా ఈ ఆడవాళ్ళ దాపరికాలు ప్రాణాలు తీస్తాయి.

చాకలి — చూడండి బాబయ్యా...ఆకాడే ఉంటుంది.

బాబు —(రెండు డబ్బాలు క్రిందపడేసి పుస్తకం వెదికి తెస్తాడు) ఊ...సరే...ఒక్కచొక్కానూ...దుప్పటీ తేవాలె. సరే...ఇకపో (స్వ) అబ్బ కొత్త పడుకొంటే బాగుండు. గలీబులు మాసినై. ఛీ,ఛీ దుప్పటినిండా మన్ను. (దుప్పటి దు

రాముా — నీవు కూడా ఏదో......ఇదిగాఉన్నావు?

బాబు — మరేంలేదురా...కొద్దిగా నీరసంగాఉంది.

రాముా — నీరసంగా ఉందీ?...కొద్దిగా తిక్క-తిక్కగా కూడా ఉంటుంది!! ఇహ ఎందుకూ? Night starvation This is evidently a case of Night starvation. తెలిసిందా?

బాబూ — ఏమిటి నీ ఉద్దేశం?

రాముా — ఏమిలేదురా...రాత్రిళ్లు...నీకు అన్నం సహించటం లేదన్నమాట!...అదిసరేగాని. అమ్మ, నాన్నా ఉన్నట్లు లేరేం?

బాబు — లేరు. గుంటూరుసు అక్కయ్యగారింటికివెళ్ళేరు.

రాముా — మరి మా వదిన గారూ.?

బాబూ — ఆవిడా దయచేసింది పుట్టింటికి.

రాముా — అదీ సంగతి...అల్లాగ చెప్పరాదూ! అందుకనే అల్లాగ ఉన్నావు!!

బాబు — అన్ని సార్లు అంటున్నావు. ఎల్లాగ ఉన్నానేమిటి?

రాముా — ఎల్లాగ ఉన్నావని చెప్పేది!
దుష్యంత మహారాజులంగారికి శకుంతలపై అనురాగం కలిగిన తరువాత నిద్రపట్టింది. కాదట! తలక్రింద చెయ్యి పెట్టుకొని పడుకోగా కన్నీటి వలన ముంజేతి కంకణాలలో తాపబడినటువంటి మణులు నీరెక్కి మలినంతో కూడుకొన్నవి అయినాయట!

అల్లాగ ఉంది స్థితి!!

బాబు — బాగేనే ఉంది

రాము — నిజంగా, నేను ఇల్లు చూచినప్పుడే అనుకొన్నాను ఇంటావిడ లేదా ఏమిటి చెప్మా అని. బాగానే ఉంది! ఎంతపని జరిగిపోయింది!

బాబు — ఏం, జరిగిందని అల్లా ఇదై పోతావ్!

రాము — ఇంతకంటే, ఏం జరగాలె!! పెద్దవాళ్ళు లేని సమయంలో నిన్ను ఒంటిరిగా వదిలేసి వెళ్ళిపోయింది: ఇల్లాంటప్పుడు, భోజనం సరిగా లేక పోవటంలో విపరీతం ఏమీ లేదు, (ఈమాటలు దీర్ఘాలుతీస్తూ అంటాడు)

బాబు — నీముఖం...ఇహ ఊరుకో

రాము — ఊరుకోటానికి కాదు...ఇల్లాంటప్పుడు భోజనమే కాదూ. గుక్కెడు మంచినీళ్లు కూడా లోపలికి పోవు ఏమను కొన్నావో...............

తెలిసిందా?.........అయితే క్రొత్త పరిస్థితు లేర్పడి ఆమె గారు వెళ్ళిందా?...............అంటే ..............

బాబు — అంటేలేదు...గింటేలేదు గాని ఇహ ఊరుకో. అసలు అల్లాంటిదేం గాదు.

రాము — (ఉద్రేకంతో) అల్లా అయినట్లయితే నిష్కారణంగా...అంటే...ఏమీ...కారణం లేకుండా వెళ్ళి ఉండి నట్లయితే...ఇది కేవలం అన్యాయం... అత్యంత ఘోరము. భరత దేశం కాబట్టి...ఇట్టి దుర్భర దారుణాలు జరగటానికి

పిల్లేండి.

బాబు — పచ్చి కేక లెయ్యాకే...ఎవళ్ళైనా వింటే నవ్వు తారు. ఊరుకో,

రాము — ఊరుకోను...ఇట్టి అన్యాయాలు నాకళ్ళ ఎదుటనే జరుగుతుంటే నేను ఎల్లాగ ఊరుకోను. (చుట్టూ చూసి చూసి గట్టిగట్టిగా నొక్కి అంటూను) ఆడవాళ్ళు ఖాట్టిళ్ళకు వెళ్ళకూడదూ అని ఒక కఠిన శాసన సింహాసనాన్ని నా [illegible] ధార పోస్తాను.

బాబూ — అల్లాగే కానీ. అయితే ప్రస్తుతం కేకలెయ్యాక కూర్చో.....సోడా కావాలా ?

రాము — వద్దు (కోపం. ఇంకా తగ్గలేదు)

బాబు — ఇంక...కాస్త ధూమపానం చెయ్యి.

రాము — (శాంతించి) అయితే.....నువ్వు [illegible] భోజనం చేస్తున్నావన్నమాట.

బాబు — ఆ, అంతే...మరేం జేస్తాం.

రాము — అవుననుకో...ఊఁ...సరే...అయితే;..... కోటాయ్ కనపడడేం !!

బాబు — వాడికి కడుపు నొప్పిగా ఉందట సినిమాకు ఇవ్వాళ రాలేడు.

రాము — కడుపు నొప్పా ?

బాబు — ఏమిట్రా వెర్రి వెధవా...కడుపు నొప్పి అంటే అంత విచిత్రంగా చూస్తావేం అదేదో అపాయకరమైన జబ్బు

అయినట్టూ ?

రామూ — కాదు. కాదు చెప్పుతా. విరోచనాలు కూడా ఉన్నాయూ ?

బాబు — ఆ...ఉన్నాయి.

రామూ — అయితే డోకులు కూడా ఉన్నై అనుమానేగా ?

బాబు — ఏమో తెలియదు.

రామూ — ఇంకెందుకూ ఉండే ఉంటాయ్ తప్పకుండా ఉంటాయి పాపం !

బాబు — ఏం, అల్లా అన్నావు.

రామూ — ఫ్రాంక్లీ కలరా జోరుగా ఉంది.

బాబు — అహా వీడికి కలరా కాదు బాగానే ఉన్నాడు.

రామూ — కావచ్చు. సంగతి చెప్పాను. అదీ సంగతి అయితే.....బాబూ...ఏదీ ప్యాకెట్ (వెలిగించి నిట్టూర్పు విడిచి) అయితే.....నీవు హోటల్లో భోజనం చేస్తున్నా వన్నమాట.

బాబు — ఎన్నిసార్లు అడుగుతావురా ఆ ప్రశ్న ? అవును హోటల్లోనే భోంచేస్తున్నాను.

రామూ — అవుననుకో...... అదికాదు నేను వెర్రిగా అడగటం లేదు ఒకటి ఆలోచిస్తున్నాను. తెలిసిందా ?

బాబు — నీవు ఏమి చెప్పావని నాకు తెలియటానికి.

రామూ — అది కాదోయ్ వెర్రినాగమ్మ వూళ్ళో...

కలరా... జోరుగా ఉన్నప్పుడూ......నీవు...హోటల్లో తిండి తినటం...అట్టే మంచిది కాదు. ఇప్పుడు తెలిసిందా ?

బాబు — అదా నీవనటం...అయితే సరే...నీవన్న మాట నిజమే...కాని ఏం జేయమంటావూ ?

రాముా — ఏం జేయ మంటానా ? కాస్త పొయ్యిమీద పెట్టుకోమంటా ?

బాబు — నిజమే కానీ...నాకు వంటచేయటం బొత్తిగా రాదు. ఇంత వరకు నే నెప్పుడూ...పొయ్యి రాజేసిన పాపాన పోలేదు.

రాముా — ఓరే బాబూ వంట చేయటానికి ఏం తెలియాలరా ? ఏహ్మా తెలియక్కరలేదు. చెయ్యటమే... తెలిసిందా అంతగా తెలియకపోతే... ఒక పాకశాస్త్ర పుస్తకం కొను. తెలిసిందా ?

ఎనిమిది అయినట్లుంది...నేను స్టేషను కెళ్ళాలె...సరే... అదీ సంగతి తెలిసిందా ?...ఏదీ...(ఒకసిగరెట్టు జేబులో వేసుకొని రెండవది వెలిగించి) ఎందుకు చెపుతున్నానో విను. గిద్దెడు బియ్యం వండుకో కాని...హోటలు కెళ్ళక... తెలిసిందా?

గుడ్‌బై......

మూడవ రంగం

[అదే. ఇల్లు. కాని వంటఇల్లు......బాబు ధోవతి కట్టుకొని పైన తువాలా వేసుకొని ఉంటాడు. ఒకమూల ఆరిపోయి ఉన్నపొయ్యి – దానిపై గిన్నె. ఇంకో పొయ్యిమీద కూర

గిన్నె. ఇంటిముందు బండి ఆగిన చప్పుడు విని బాబు వీధితలుపు తీస్తాడు. బండిలోనుంచి జయ, మీనా, దిగుతూ ఉంటారు — జయ ఉప్పాడ జరీచీర కట్టుకుంది. మీనా పరికిణీ కట్టుకొని పైన వల్లె వేసుకొంది]

బాబు — ఇవ్వాళే వచ్చారే! మీనకూడా వచ్చిందే! ఏం మీనా?

ఆ మూట ఇంట్లో పెట్టనోయ్. ఆ జాడీ లేమిటి? సరే తీసుకురా. ఆ బుట్టలేమిటి?

మీన — పండ్లు బావా.

బాబు — (అన్యమనస్కుడై) పండ్లా? పండ్లెందుకూ?

మీన — ఇదేమిటే అక్కయ్యా! పండ్లెందుకూ అంటూ డేమిటే? (నవ్వి) పండ్లు తింటారు బావా!

బాబు — అవును అవునులే...... నిన్ను చూచిన తర్వాత మతికూడా పోయింది నాకు మీనా!

మీన — ఈ మధ్య నీకు ఎప్పుడొచ్చిందీ పోవటానికీ?

జయ — మీ సరసాలకేం గానీండి... ఆతన్ని పంపే శెయ్యండి.

బాబు — పొమ్మనూ.

జయ — నాదగ్గర చిల్లరలేదు.

బాబు — అల్లాగ అనరాదూ...... (పర్సు తెచ్చి) ఇందవోయ్......అంతేగా...ఇంక.

జయ — అల్లాగ ఉన్నారేమండీ.

బాబు — .......... ........................ ..

జయ — మిన్నకుల్లే ... అల్లాగ ఉన్నావేమిటీ అంటా ?

బాబు — అఁహ ఏంలేదూ ... ... ఎందుకున్నానూ ?

మీనా — హోటల్ భోజనం పసగా లేదసి బ్రాహ్మడు కాదే ! (నవ్వి) భోజనం పసిగా లేకే. గల్లాగ అయిపోయినాడు పాపం

చెక్కిళ్లు చెమరించి చిక్కిపోయాయి
బంగారు మైచాయ కందు వారింది
తళుకు కన్నుల సోయగము తగ్గిపోయింది
అక్కడ ఆఫీసున్నులో చిక్కాడు బావ.
చిక్కాడు చిక్కాడు
చిక్కి సగమైనాడు

జయ — ఊరుకో మీనా. అల్లరిచేయక సకవిత్వానికేం గాని. మీనా. ఇల్లంతా నానా గలీజుగా ఉంది చూశావా?

మీనా — ఉండకు ఏమరీ ! నువ్వు లేకపోతే ఎల్లాగ ఉంటుందే అక్కయ్యా ! ఆడది లేని కాపురం — వెన్నెల లేని రాత్రీసి !..

జయ — ఎక్కడ ఉండాల్సినవి అక్కడ లేవుగద ! వంటింట్లోకి ఎందుకొచ్చిందిచెప్పూ ఈ టేబిల్ ? ...

ఈ త్రాసేమిటి ఇక్కడా ?

మీనా — నేనింకా చూడలేదు సుమీ. ఈ త్రాసు ఎందుకు బావా ?

బాబు — త్రాసా త్రాసూ ... (తలగోక్కుంటాడు)

ప్పుడు ఉందా ?

మీనా — ఎందు కుండదే జయక్కా ! అన్నీ ఉంటై. ఇంత కూ నీవు అదృష్టవంతురాలవే అక్కా. బావ నీకు పంచభక్ష్య పరమాన్నాలూ వండి పెడతాడు ఎక్కడైనా వేరుడు కాపరం పెడితే...... అక్కా......అక్కా...బావమీద పద్యంక డుతున్నాను ఉండు...(ఆలోచించి క్షణం అయినతరువాత)... ఆ అక్కయ్యా...

అధిక బలుండైన భీమసేనుండే
వలలుడను పేరున వంటలవాడుఅయి
పలుతెరంగు పప్పుల పిండివంటలున్
ఒప్పుగజేసె మహీశుని మెప్పుగాంచ

నిచ్చలు షడ్రసంబులు, బావ, నీ
నచ్చిన పాకమునన్ పచనంబొనర్చిగో
ర్వెచ్చని పాయసంబులన్ పెట్టునులే
క్రొంజవ్వుల్ జనింప ప్రీతిపుట్టగన్.

బాబు — పద్యం లాగానే ఉందే మీనా ఆ తమాషే...

మీనా — (మాటకు అడ్డొచ్చి)...బావా. బావా. అయి తే ఆవేలుకి కట్టేమిటి ?

బాబు — ఇందాక బెండకాయలు తరుగు తుంటే. వేలు తెగింది.

జయ — అయ్యయ్యో...ఎందుకొచ్చిన అవస్థిదిమీనాకూ?

బాబు — అవస్థ ఏముంది జయా. ఏదో సరదా పడ్డాను.

మీనా — బావకు ఇటువంటి సరదా కలగటం నీ అదృష్టం కాదుటే అక్కయ్యా ? నీవేం కష్టపడక్కరలేదు.

జయ — అయ్యో ! అయ్యో ! ఆయన వండటం. నేను తినటం !!

మీనా — వండలేకేమే అక్కయ్యా ఇదుగో చూడు అన్నం !

జయ — ఇదేమి అన్నమే ?...బియ్యం బియ్యంగానే ఉన్నాయి !

బాబు — బియ్యం...ఇంకా...అన్నంగా మారలేదు.

మీనా — పాపం పొయ్యి...ఆరిపోయిందే ! దానికేం గాని కూర వండాడు చూశావా ? బెండకాయ కూర దివ్యంగా తయారైంది !!

బాబు — ఇంకా తిరగమూతా, అదీ వెయ్యలేదు– వేద్దామని అనుకొంటూ వుండగానే మీరూ వచ్చారు.

మీనా — వెయ్యాలా ఏమిటి ? వెయ్యక పోతే నేమి ? దివ్యంగా ఉందికూర !

జయ — ఏదీ ?...ఇవేమిటే బొగ్గుల్లాగ !!

మీనా — బొగ్గులా ఇవి !! బెండకాయ ముక్కలు కనపడటం లేదటే ! నలభీమ పాకాలు తయారు చేశాడు బావ! ............అయితే.........బావా...అసలు నీకు వంట చేయటం ఎల్లాగ చేతనైందీ అంటా !!

బాబు — పాకశాస్త్ర పుస్తకం ఒకటి కొన్నాను.

మీనా — అదీ సంగతి !! పుస్తకంజూచి వంటచేయుటం పూలాంటే...ఇంత బాగా తగలెట్టిండే!!

ఈ తెల్లకాయితాల పుస్తకం పెన్సిలు ఇక్కడున్నవేం బావా ! ఇందులో ఏవో లెక్కలు వ్రాసు కొన్నాడే ! (చూచి నిడగబడి నవ్వి.) అక్కా...అక్కా...రావాలే ఈ లెక్క చూశావా... "వీసెడు బెండకాయలకు నాలుగు అణాలు ఆవాల్తైతే......అర్ధశేరు సనటాకుక్క ఎంత ? (మళ్ళీ నిలువ లేనంగా నవ్వి) లెక్కలు చేస్తున్నాడే వంటకూ !! (నవ్వు తీరి) అప్పు ఇక నవ్వలేనే కాసిని మంచి నీళ్లు ఇయ్యవే జయక్కా...

జయ — బిందెలో ఉన్నట్లున్నాయి -- (చెంబుతో ముంచి ఇస్తుంది)

మీనా — ఉప్పు నీళ్ళేమే !

జయ — అయ్యో............

బాబు — ఇల్లాంటి పొరపాట్లు వస్తాయనే అక్కడ వ్రాసి పెట్టాను ఇవి మంచి నీళ్ళు, ఇవి ఉప్పు నీళ్ళు అని !

మీనా — నిజమేనే అక్కా, ఇక్కడ బిందెలకు కట్టేసిన అట్ట ముక్కలు చూడలేదు నీవూ !! పాపం. వాటిపైన, మంచినీళ్లు ఉప్పు నీళ్లు... అని వ్రాసి పెట్టాడే !! (నవ్వు)

జయ — ఇంటినిండా అట్ట ముక్కలే !!

మీనా — తీసి పారేయవే జయక్కా లేకపోతే...... మన మెడలకు కూడా కట్టేట్టున్నాడు...జయ...మీనా... అని...

———

# జయమ్మ కాపురం

---

## ద్వితీయాంకము — ప్రథమరంగం

( పటాలతో అలంకరించినగది. ఒకబల్లమీద ఊదువత్తులూ, పలుహారాలూ, ఇంకోబల్లమీద కేరియో ఉంటాయి. గదిలో గోడను ఆనుకొని ఒకచక్కని మంచం. దానిపైన పరుపు తెల్లనిదుప్పటీ ఆపైన పూలు.

బాబు టీపాయ్ ప్రక్కగా ఉన్నకుర్చీలో కూర్చుని సిగరెట్టు కాలుస్తూ మధ్యమధ్య మేడమెట్లవైపు తొంగిచూస్తూ ఉంటాడు. మెట్లదాకా వెళ్లిమళ్లీ తిరిగి వస్తుంటాడు.

గోడగడియారం 9 గంటలు కొడుతుంది. గడియారం అంకెలు చూస్తూకూడా తొమ్మిది గంటలూ లెక్కపెడతాడు.

ఇంకోసారి మెట్లదాకా వెళ్ళొచ్చి ఆవలించి చిటికలు వేస్తాడు. జయ క్రిందహాలులో, ఆడబిడ్డతోను, ఇంకెవ్వరో ఒక యిద్దరు స్నేహితులతోనూ మాట్లాడుతూ ఉంటుంది బాబూ కాసేపు అడా బాపైన పచారుచేసాడు నవవధువు ఎంతసేపటకీ రాదు.)

బాబు — అమ్మా కాసిని మంచినీళ్లు కావాలే.

అత్తగారు— (జయ అత్తగారూ ఆడబిడ్డా ఒకరి ముఖంఒకరు చూచుకొని నవ్వుకొంటారు. జయ అత్తగారు అంటుంది.)

"వెళ్లవేజయా, వెళ్లికాసినిమంచి నీళ్లు ఇచ్చిరా వాడికి."

జయ — మంచం క్రిందే పెట్టాంనడీ—కనపడలా ?

బాబు — (ఒక్క క్షణంఆండి). ఆఁ ఆఁ సరేలే.

మీన — బావ ఏంజేస్తున్నాడో చూచొస్తా.

జయ — నీవక్కడికి వెళ్లబోకుమీనా. బావను చదువుకోనీ ........ క్రిందటి సంవత్సరంకూడా పరీక్ష పోయింది.

మీన—పాపం పగులల్లా ఏంకష్టపడి చదువుతున్నాడే. (నవ్వుతుంది) చూస్తునేఉన్నావు నీవుకూడా బావ గదిలోచేరి చదువు పాపం సాయంజేస్తున్నావుకాబోలు !!

జయ —మీనా, నీవూరుకో. ఈఎండకాలం పగలుఅసలు చదువు సాగదు. ఏమన్నాచదివితే రాత్రిళ్లే !!

బాబు(కాసేపుచదువుకొని. క్రిందికివస్తాడు. )

బాబు — నిప్పుపెట్టె చూశావుటే మీనా !

మీన — అక్కయ్య పెట్టెలో ఉన్నయ్యి నిప్పుపెట్టెలు. తాళంచెవి దానిమెళ్లోఉంది.

అత్తగారు — ఓసి, భడవా ...ఎంతటక్కరుగా మాట్లాడతావే. జయా. చూచి ఇవ్వవేపాపం వాడుచదువుకోవాలె.

జయ — పెట్టెలోవి తీయటం ఎందుకూ లాంతరుపైన ఉండి అదిగో ! ! కనపడలేదండీ !

బాబు — కనపడ్డది. కనపడ్డది. (అనిముడుచుకొనివెళ్లిపోతాడు.

మీన — బావకు ఏమీ కనపడవేమే ! (ఆవలిస్తుంది

జయ —సరేకాని పడుకోపోనీకు నిద్రవస్తున్నది.

(గడియారం పదిగంటలు కొడుతుంది జయ ఆవలిస్తుంది)

అత్తగారు — పో అమ్మా వెళ్ళిపడుకో—పద్దెంది.

మీనా —వెళ్లవే. పాపంబావకు నిప్పుపెట్టెలూ మంచినీళ్లూ అవీ కనపడటంలేదు!! నానా అవస్థాపడుతున్నాడు. వెళ్ళి... ఏవి......ఎక్కడ...ఉన్నవీ చూపించు. (అంటానవ్వుతారు.)

## రెండో రంగం

## VI

(ఇందాకటి పడకటిల్లే దీపం వెలుగుతునే ఉంటుంది బాబు పక్కపై పడుకొని కళ్ళుమూసుకొని ఆలోచిస్తుంటాడు మెట్లదగ్గరగాజులచప్పుడు కాగానె, జయవస్తున్నదని గ్రహించి, నిద్రనటిస్తుంటాడు)

జయ — (ప్రవేశించి) (స్వ) దీపం, ఆర్పేయకుండానే పడుకొన్నారే చదువుతూ చదువుతూ నిద్రపోయినట్లుంది. పుస్తకం ప్రక్కనే పడేసుంది! (అని పుస్తకం తీసి బల్లమీదపెట్టుతుంది.) పాపం, పరీక్షకోసం కష్టపడి చదువు తున్నారు (అనితనలోతాను నవ్వుకొంటుంది) (ఈమాట వినేసరికి బాబూకు నవ్వొస్తుంది తా నెంతకష్టపడి చదువుతున్నదీ. ఆతనికి తెలుసునాయె అందుకని నవ్వుకుంటాడు. జయ దీపం ఆర్పేస్తుంది)

బాబు — దీపం వెయ్యి.

జయ — (ఫక్కున నవ్వి) అయితే మేలుకొనే ఉన్నారా!

బాబు — చదివి చదివి ఇప్పుడే కళ్ళు మూశాను. నువ్వెప్పుడొచ్చావ్?

జయ — మీరు దొంగనిద్రపోవటం ప్రారంభించటంతోనే వచ్చాను.

బాబు — అదనా? దీపం వెయ్యమనలేదూ.

జయ — ఎందుకండీ. నిద్రపోరూ? పాపం కష్టపడి చదువుతారాను! (వెక్కిరింతగా)

బాబు — కాదు. కాదు కొన్ని ముఖ్యవిషయాలు మాట్లాడాలి. (జయదీపం వేస్తుంది. ఇద్దరూ చెరో కుర్చీమీద కూర్చుంటారు. బాబూ జయవంక చూస్తాడు)

జయ — ఎందుకలా దీపం వెయ్యమన్నారూ! చెప్పండీ తొందరగా. నాకు నిద్రవస్తున్నది. వెళ్ళి పడుకోవాలి.

బాబు — పడుకుందువుగాని ఉండు.

జయ — ఎందుకండీ?

బాబు — అది గాదు ఈ ఎలక్ట్రిక్ లైట్లో నిన్ను కాసేపు చూడనియ్యి.

జయ — పగలంతా చూస్తునే ఉంటిరి గదండీ. చదువుకూడా మానేసి

బాబు — అదివేరు రాత్రి లైట్లో అదో విధంగా ఉంటావు... నీ ఒళ్ళు బంగారంగానూ అల్లా నవ్వుతావేం

జయ — (ఒక్కక్షణం అయిన తరువాత) మూశారుగా!

నేను పడుకుంటా—మీకేం ఆనల్లోకి తేశ్వరుడులాగ అల్లాగ మూస్తునేఉంటారు (అంటూ దీపం ఆర్పేస్తుంది తనగదిలోకి వెళ్ళి పోతుంది)

బాబు — (లైటువేసి) జయా. జయా. ఒక్కమాట. మరి అల్లాగ మూర్ఖంగా వెళితే గాదు.

జయ — ఏమిటి చెప్పండి.

బాబు — కుర్చో చెప్తా.

జయ — ఆ చెప్పండి.

బాబు — మరీ...ఇప్పుడు పొద్దుపోయిన మాటనిజమే నీకు నిద్రవస్తూండవచ్చు. ఆమాట నేను కాదనను కాని......

జయ — ఏమిటంట...ఇదంతా

బాబు — నీవాలా అల్లా తొందరపడితే కాదు

జయ — వింటాను. చెప్పండి.

బాబు — నేను చెప్పేది చాలా ముఖ్యమైన విషయం అంటే మామూలు విషయంకాదు. (అంటూ కుర్చీ జయమ్మ కుర్చీ వైపుకు జరుపుతాడు) అయిందా?

జయ — ఏమిటి అయింది!

బాబు — విషయం మామూలు విషయం కాదు.

జయ — (జయ కుర్చీ కొంచెం బాబు వైపుకు లాక్కొని శ్రద్ధగా వింటానికి తయారవుతుంది) — ఊఁ

బాబు — అంటే చాలా ముఖ్యమైన విషయమన్న మాట ఇప్పుడు చూశావా (కుర్చీ కొంచెం ముందుకు జరుపు

కొని) ఒక్కొక్క విషయం ఎల్లా అయినా ఫరవాలేదు కొన్ని కొన్ని విషయాలుంటవి...అవి...ఇంకోలాగ అనుకుంటానికి వీల్లేదు. అవునంటావా ?

జయ — అవును.

బాబు — అవునా మరి నీతో...ఇప్పుడు ఒక్క ముఖ్యమైన విషయాన్ని గురించి మాట్లాడాలి. చాలా గొప్పవిషయమన్నమాట.

జయ — ఊఁహూఁ. చెప్పండి.

బాబు — తొందరపడితే ఎల్లాగ. ఇదే నన్నామాటా మూలు విషయమూ. చప్పున చెప్పేయటానికి ? ఏమిటంటే (గొంతు సవరించుకొని – కుర్చీ ఇంకా ముందుకు లాక్కొని.) మన ఇద్దరికీ సంబంధించిన దనమాట.

జయ — అల్లాగే...ఊఁ

బాబు — మీనన నిద్ర పోయిందా – ఇక్కడెక్కడన్నా ఉందా ?

జయ — లేదులెండి......చెప్పండి.

బాబు — అంటే ఎవరూ వినకూడదు. చాలా ముఖ్యమైన విషయమని చెప్పాను కానూ. మరోటి మరోటి అయితే ఎలాగయినా ఫరవాలేదు. ఇప్పుడు ఈ విషయంలో అటూ ఇటూ అయిందా అంటే; పీకలు తెగిపోతయ్యి.

జయ — ఏమిటండీ అంత గొప్ప విషయం. (ఆదుర్దాగా మరికొంచెం ముందుకొస్తుంది)

బాబు — గొప్ప అని మెల్లగా అంటూ వేమిటి ? కొంప
లు ఎగిరి పోతయ్యి అన్నమాట — యుద్ధాలు—ఘోర
యుద్ధాలు జరుగుతాయి — జరిగినాయి కూడా చాలా గొప్ప
విషయంలే ! — (మాటలు నొక్కి అంటాడు)

జయ — (నవ్వు ఆపుకొని) నిజమే. నిజమే.

బాబు — తెలిసిందా...చాలా గొప్ప విషయమన్న
మాట ఊ...పీకలు తెగి పోయే విషయం అన్నమాట

జయ — అహా — (ఆశ్చర్యపోతుంది)

బాబు — మరో విషయం అయితే నేను అసలు పట్టించు
కోను

జయ — అవును. నేను చూస్తూనే ఉన్నా

బాబు — ఇల్లాంటి విషయం. అంటే కొంపలు ఎగిరి
పోయే విషయం చూశావా మనం జాగ్రత్తగా ఉండాలె.
ముఖ్యమైన విషయం. తెలిసిందా ?

జయ — తెలిసింది. ——— తెలిసింది. (నవ్వుతుంది.)

బాబు — అసలు విషయం చెప్పనీ ...... (కొద్దిగా
నవ్వుతాడు)

జయ — తెలిసిందిగా......(పెద్దగా నవ్వుతుంది)

బాబు — చాలా గొప్ప విషయం. ముఖ్యమైన విషయం.
అని బాబు నవ్వు ఆపుకో లేక నవ్వుతాడు జయా నవ్వుతుంది.
ఒకర్నిజూచి ఒకరు నవ్వుతారు. జయ నవ్వు ఆపుకొంటుంది.
బాబు నవ్వు ఆపుకొంటాడు. మళ్ళీ నవ్వు బద్దలై వస్తుంది.

తెరలు తెరలుగా వచ్చేనవ్వును ఆపుకొంటూ, నవ్వుకొంటూనూ, ఒకర్ని చూచి ఒకరు నవ్వుతారు. ఇల్లాగ పది నిమిషాలు గడుస్తుంది. చివరకు ఇంతకూ ఆ ముఖ్యమైన విషయం ఏమిటంటే — చాలా గొప్ప విషయం. అని విరగబడి నవ్వుతాడు బాబు. ఆమె నవ్వుతుంది.

తెర

## మూడో రంగం

## VII

(పంతులు : 54 సంవత్సరాల వయస్సు కాని చూపులకు ఇంకా ఎక్కువ వయస్సు కలవాడిలాగా ఉంటాడు బాబూ, ఆయనకి ఒక్కడే కుమారుడు. బాబూ మీద తండ్రికి అమిత ప్రేమ. పంతులూ, మణమ్మగారూ కూడా కొడుకునూ కోడల్నీ గారాబంగా చూచుకొంటారు)

పంతులు — మీనా, మీ అక్కయ్యను ఓ సారి ఇల్లాపిలు.

ప్ర. జయ. మీనా.

పంతులు — జయమ్మా, నీవు స్కూలు ఫైనల్ క్లాసు దాకా చదివావు కాదూ ?

జయ — లేదండీ.

మీన — అయినా పరీక్షకు పంపితే తప్పకుండా ప్యాసు అవుతుందండి మామయ్యా :

పంతులు — అయితే జయమ్మ తల్లీ, నాకు విద్యావంతు లైన స్త్రీలను చూస్తే ఎక్కువ గౌరవం. నాపిల్లలూ......... నా కోడలూ విద్యావంతులై ఉండాలని నేను పెద్ద కోరిక పెట్టుకొన్నాను. స్త్రీలకు విద్య చెప్పించండి అని పెద్ద పెద్ద ఉపన్యాసాలు ఇస్తుంటాను. కాని నా ఇంట్లోనే నా కోడలు, పరీక్షలేవీ ప్యాసు కాకుండా, ఉండీ, విద్యావంతురాలు కాదు అనిపించు కోటం నాకు ఏమి బాగుండలేదు. పరీక్షలు ప్యాసు కాకపోతే ఏం అని నీవు అంటె అనవచ్చు. అదివేరే విషయం కాని నీవుస్కూలు ఫైనల్ ప్యాసు అయి ప్రైవేటుగా అయి నా సరే బియ్యే ప్యాసు కావాలని నాకోరిక. మరి ఏమంటావ్రూ?

జయ — మరి ఎల్లాగండి. నేను స్కూలుఫైనల్ పరీక్షకు ఒక సారైనా వెళ్ళలేను.

పంతులు — నిన్ను మెట్రిక్యులేషన్ పరీక్షకు పంపుతాను. ఇవిగో పుస్తకాలన్నీ కొని తెచ్చాను. నీవు తెలివిగల దానివని నాకు తెలుసు. కష్టపడి చదువు.

మీనా — కష్టపడి చదివితే...తప్పక ప్యాసు అవుతుంది. ఫస్టుక్లాసులో ప్యాసు అవుతుంది మామయ్యా వస్తే మెడల్ కూడా రావచ్చు.

పంతులు — అంత కంటే సంతోషం ఏముందమ్మా జయమ్మా...ఈ రోజునుంచీ నీవు చదువు. ఏదైనా తెలియక పోతే నన్ను అడుగు. ఆ...

మీనా — మీరు ఎప్పుడూ ఇంట్లో ఉండరుగా ! అందుకని

బావనడుగుతుందిలెండి! ఏం జమకా్క. బావనగ్గిర చెప్పించుకో ఏం ?

పంతులు — పోనీ అల్లాగే కానీ దానికేం. కానీ ఇంకోటి. వాడూ క్రిందటిసంవత్సరం బి. ఎ. తప్పాడు. పోనీలే, తప్పితే తప్పాడు అందుకుకాదు. ఈసంవత్సరమైనా ఫ్యాసుకావాలె. చదువుతున్నాడనుకోంటూ. కాస్త వాణ్ణి కనిపెట్టిచూస్తుండు బాగాచదువుకోమనిచెప్పు

మీనా — (నవ్వుతుంది)

పంతులు — ఏమే మీనా ఎందుకు నవ్వుతాన్వూ ?

మీనా — ఏంలేదు మామయ్యా బావ బియ్యేను అక్కయ్య మెట్రిక్యులేషన్నూ ఒకేసారి ప్యాసుఅయితే ...(నవ్వుతుంది) చాలాతమాషాగా ఉంటుంది మామయ్యా ఇందులో మెడల్ ఎవ్వరికొస్తుందా అనినవ్వుతున్నాను.

పంతులు — ఎవరికైనా రావచ్చు.

మీనా—ఎవరికొచ్చినా మనకు సంతోషమేగా మామయ్యా వాడుద్దేశంలో అక్కయ్యే మెడలు సంపాదిస్తుంది.

పంతులు —సరే. అమ్మాయీ, నాకోరిక ...ఊరికేపో నియ్యకు. నీవుతప్పకుండా మెడలుకోసమే ప్రయత్నంచెయ్యి.

మీనా — అక్కయ్యా. నీకుమెడల్ వచ్చిందాకా నేనిక్కడేఉంటూ. మెడల్ చూచిగాని వెళ్లను.

## నాలుగో రంగం

(రాత్రి 9 గంటలు. మామూలు పడకటిల్లు జయ. బాబు. ఉంటారు)

జయ — అల్లాగ అన్నారు మామగారు ఇకమీ ఇష్టం.

బాబు — మంచిగాటేగా తప్పకుండా నేనుకష్టపడి చదువుతా నీవంటి యోగ్యురాలైన భార్య చెప్తూఉంటే ఎవరువినరు.

జయ — మీరు తప్పకుండా ఫ్యాసుఅవుతారు.

బాబు — నీవుకూడా కష్టపడిచదువు నాకన్న కోరికచెల్లించాలె

జయ — అదేమీ కోస్తున్నా. ఎట్లాగయినా మెడల్ సంపాదించి మామగారిని సంతోషపెట్టాలని.

బాబు — నేను. నిజంగా ఫ్యాసు అవుతాను జయా మనం ఇద్దరం కూడా ఒకేసారి ఫ్యాసుకావాలె

జయ — నాకోరికా అదే. నేను మెడల్ సంపాయిస్తే కనకదుర్గమ్మకు నంద కొబ్బరికాయలు కొడతాను. పానకాలరాయడికి వందబిందెల పానకంకూడా చేయిస్తాను.

బాబు — అంతే. అంతే.

జయ — నేను ఫ్యాసుఅయి మెడల్ సంపాదిస్తాగా. ఇంకనాకు ఏకోరికా ఉండదండీ.

బాబు — ఇద్దరం ఒకసారే తప్పక ఫ్యాసు అవుతాము. రేపటి నుండే చదువుకు ప్రారంభం నీవుహాల్లో కూర్చో. నేను గదిలో కూర్చుంటాను. తెలిసిందా.

జయ — సరే. అల్లాగే.

# జయమ్మ కాపురం

---

## తృతీయాంకము — మొదటిరంగము

(పగలు ఎనిమిదిగంటలు కాఫీ త్రాగి బాబూ చదువుకొం టూ ఉంటాడు పుస్తకాలన్నీ చక్కగా సర్ది పెట్టుకొని దీక్షగా చదవాలన్న ఉద్దేశాన్ని. నిశ్చయాన్ని పుస్తకాలు సర్దటంలో స్పష్టంగా కనపరుస్తాడు. పుస్తకాన్ని చూస్తూ కుర్చీ లో కూర్చుంటాడు.)

మీనా (పాడుతూ ప్రవేశము)

బావా

బాబు — ఎందుకే మీనా ?

మీనా — ఎబ్బే ఏంలేదు. బావా కుర్చీలోనుంచి పడతా వేమో. పోనీ ఆ మంచంమీద కూర్చో. పడుకోరాదూ బొ త్తిగా తూలిపోతున్నావు.

(వళ్లువిరుచుకొని ఆవలించి) అల్లాగా రాత్రంతా నిద్ర పట్టలేదుమీనా

మీనా — అవునవును అక్కయ్య అల్లాగే ఉంది. పాపం మెడల్ కోసం ప్రయత్నిస్తున్నారాయె — (నవ్వుగా)

బాబు — (కొద్దిగా నవ్వి) అంతే — అంతే — అక్కయ్య

ఏంజేస్తున్నది ? (నిద్రమత్తుగా చూస్తూ)

మీనా — హిస్టరీ శాస్త్రకాన్ని ముద్దెట్టు కొంటున్నది. (వెక్కిరింతగా)

బాబు — పరీక్ష ఇంకా ఎన్నాళ్ళో లేదు. ఇల్లాగ అయితే లాభం లేదు. (మత్తుగా ఉండి మాట్లాడినట్లు) ఒకసారి ఇల్లా పంపించు, మీ అక్కయ్యను గట్టిగా కోప్పడాలె.

మీనా — వద్దు బావా. నీవే కోప్పడితే...ఎట్లా ఈసారికి క్షమించు...

బాబు — సరే ... క్షమించానని చెప్పు — గట్టిగా చదువుకోమును. (అని తాను వెళ్ళి పరుపుపైన పడుకొంటాడు)

మీనా — అల్లాగే — (అని వెక్కిరింతగా అని వెళ్ళుతుంది) జయ తో — ఈసారికి నిన్ను క్షమించాడు బావ.

జయ — ఎందుకే.

మీనా — చదవటం లేదుగా.

జయ — అహా...అందుకా — (నిద్రమత్తుగా)

మీనా — మరినీవు ఈ సంవత్సరం మెడల్ సంపాదించక పోతే ఊరుకోట్ల !!

జయ — (బాగా నిద్రమత్తుగా ఉండి కుర్చీలో నుంచిలేచి పరుపుపైన పడుకొని) అందుకనే...........

బాబు — (ఒక్కక్షణం అయినతరువాత బాబూ ఉలిక్కి పడిలేచి పుస్తకం తెరచి ఒకనిమిషం చదివి) — జయా

జయ — (ఉలిక్కిపడి లేచి). ఆ — ఎందుకూ (మీనా

జయ గదిలో ఉంది. అక్క ఉలిక్కిపడి లేవటం చూచి నవ్వుతుంది)

బాబు — జయా ఒక్కసారి ఇల్లా వస్తావుటే.

జయ — ఎందుకూ ?

బాబు — ఒక్కసారి రావాలె.

జయ — ఉహు.

బాబు — కాదు. పనుంది.

జయ — వీల్లేదండీ. చదువుకొంటున్నా – (నవ్వుకొంటుంది).

బాబు — ఇప్పుడే వెళ్ళచ్చు.

జయ — ఎందుకూ ?

బాబు — ఎందుకా ... ఎందుకంటే ...... మరి ... ఊరికే ఎందుకు చెప్పాలి ? నెధవమతి మరుపు. చదువుకోవాలె. అందుకని ఒక్కసారి ఇల్లా రమ్మంటున్నా.

జయ — (పెద్దగా నవ్వి) — చదువుకొనే దానికి నే నెందుకూ. రాను. చదువుకోవాలె. (పుస్తకం తెరిచి చూస్తుంటుంది)

బాబు — అదిగాదు జయా ... చదువు సాగకుండా ఇక్కడో కాకి గోలచేస్తున్నది. కాస్తవచ్చి తోలేసెయ్యి.

(వెళ్ళటానికి – లేస్తుంది. మీనా అక్కను కుర్చీలో కూర్చోబెట్టి, ఆగదిలో నుంచే హూష్— హూష్— అంటుంది. అని జయ మీనలు నవ్వుతారు. జయా, మీనా,

బాబు గదిలోకి నవ్వుకుంటూ వెడతారు. బాబూ కూర్చుని ఉంటాడు. చేతిలో పుస్తకం ఉంటుంది).

మీనా — బావా, పోయిందా కాకి ? పాపం చదువుకోనీ కుండా గోలచేసిందా ! కాకిగోల ! — కాకిగోల ! పంచదుమ్ము. సాగుతుంది పాపం ! (అంటూ తలనిమురుతుంది)

బాబు — కాకిపోయే ఉంటుంది. కాని రెండు చిలకలు కిచకిచ లాడుతున్నాయి. చూశావా ?

మీనా — నీవు సరిగ్గాచూడలేదు. ఒకగోరంకి కూడా ఉంది

(అని తుర్రున పారిపోతుంది)

(జయా, బాబూలు ఒకర్నొకరు జూచి ఒకరు నవ్వుకొంటారు),

X

# రెండో రంగం

(మామూలు పడకగదికి ముందున్న హాలు. జయ, బాబు, ఎదురు బొదురుగా కూర్చుని మాట్లాడుతూ ఉంటారు. ఊదు వత్తులు వెలుగుతూ ఉన్నాయి. ఆ వైపున తెల్లని పక్క దంపతు లను ఆహ్వానిస్తూ ఉంటుంది. మీనా పాడుకుంటూవచ్చి, దూరంగా ఏదో సద్దుతూ ఉంటుంది. రాత్రిసమయము.)

జయ — మీరు బొత్తుగా చదవటం లేదు.

బాబు — మాట్లాడడు.

మీనా — పాపం చదువుతునే ఉన్నాడే ! రాత్రంతా

చదవటం మూలాన మాచావుగా ప్రొద్దున పాఠం చదవలేక పోయినాడు. అంతేకాని రాత్రిళ్లు బాగా చదువుతున్నాడు.

జయ — అవునవును. (అని నవ్వుతుంది మీనాక్షి విసుక్కొని)

మీనా — అవునుగాని బావా ఇవ్వాళ రాత్రి బాగా చెప్పు చదవాలె నీవు. నీకోసం టీ కూడా చేశాను. పుచ్చుకొని మేలుకొని కష్టపడి చదువు. తెలిసిందా ?

(అని వెళ్ళి టీ తెచ్చి మూడు కప్పుల్లోనూ పోస్తుంది. బాబు ముందుగా ఒక గుక్కెడు త్రాగి) బావా పంచదార కొంచెం తక్కువ అనుకొంటా ?

జయ — కొంచెం తక్కువగానే ఉంది.

మీనా — ఇంకొంచెం వెయ్యనా బావా ?

బాబు — (నవ్వుతూ) — అక్కర్లేదు మీనా — When you are beside me, I want no sugar in my tea— (అని బుగ్గ గిల్లుతాడు.)

మీనా — చూడవే అక్కయ్యా ?

జయ — ఏం జేశారే ?

మీనా — బుగ్గ గిల్లుతున్నాడే !

జయ — బుగ్గ గిల్లుతారుటండీ...(గిల్లు అనేమాట నొక్కి పలుకుతుంది)

బాబు — Excuse me మీనా బుగ్గలు గిల్లకూడదు. అవి, అంటే ఇంత చక్కని గులాబి పువ్వులవంటి బుగ్గలు, గిల్ల బడేందుకు ఏర్పడ్డవి కావు, అవి ఎందుకు ఏర్పడ్డయ్యా అంటే

— (ముద్దెట్టుకొని) — అందుకనా.

మీనా — ఓహో, (అని మూతి ముక్కు తిప్పి కోపం నటిస్తుంది)

జయ — ఏం, పని అండీ అది.

బాబు — ఏం? ఏం ?

జయ — మాచెల్లెల్ని ముద్దెట్టుకోవచ్చా !

బాబు — మనసులో మనసులేదు జయా. ఏమిటో మీచెల్లెలను కోలేదు ! !

మీనా — ఇదెప్పటినుంచే అక్కా !

జయ — మతి లేదే మీ బావకు. చదువుఎక్కువైంది.

బాబు — ఇక నేను చదువుకోవాలె.— (అని పిల్లదగ్గిర కెడతాడు — (సీరియస్ గా) మీనా ఆవలిస్తుంది. )

జయ. — మీనా నీవు పడు కోతస్లి

మీనవెడుతుంది

వెడుతూ — మామయ్యా అడిగితే — బావచదువు కొంటున్నాడని చెపతుంది.

(బాబు ఒక్కక్షణం గట్టిగాచదివి) — అయితే జయా ?

జయ — (హాలులో మంచంపై పడుకొని) ఆ. — మీరు చదువు కోండి. మామగారు మిమ్మల్ని నాకు ఒప్పచెప్పారు. మిమ్మును చదివించేబాధ్యత నాది. మీరు చదవక జయా, జయా అని పిలిస్తే నేను పలకను. కష్టపడి చదవండి నామాట విని. మీ కేం మీరుబాగానే ఉంటారు అంతా నన్నంటారు.

పెళ్లాంవస్తే చదువుపని సాగుతుందీ అని. నేను మాటలు పడను బాబూ! మీరు నన్ను పిలవకండి. ఇదేచెపటం బాగా చదువు కోండి. (అని సీరియస్ గా చెప్పి వెళ్ళిహాల్లో మంచంపైన పడు కుంటుంది బాబు ఈ మాటలన్నీ మెదలకుండా వింటాడు. స్ఫూర్తులు కుర్రాడులాగ)

బాబు — నిజం. నువ్వన్నమాటముమ్మాటికీనిజం ఇదిగో ఇప్పుడే ప్రారంభిస్తున్నాను. చదువుతాను. కష్టపడి చదువుతాను నిన్నుపిలవను. ఒక వేళ పిల్చినానీవు పలకకు. సరేనా! (అని తన గదిలోకిపోయి చదువు ప్రారంభిస్తాడు. ఆగదిలోనుంచి హాల్లోకి పోయ్యే ద్వారం తెరిచేఉంటుంది. జయ పడుకొని గమ నిస్తూఉంటుంది )

## మూడో రంగం

ఇందాకటి పడకగది. తెరఎత్తేసరికి బాబూమంచంమీద పడుకొని చదవు కొంటూఉంటాడు.

బాబు — (లేచి) ఏంచదవాలో తెలియటంలేదు. అన్నీ వచ్చినట్లే ఉన్నాయి. మళ్ళీ ఏంరాదు.

అని జయవంక చూస్తాడు. తలదువ్వుకొని హాజిలైన్ పోన్నరా సుకొంటాడు. మీసాలుదువ్వుకొని సిగరెట్టు వెలిగించుకొని అద్దం లోచూసు కొంటాడు. అది జనవరి 15వతారీఖు. ఏప్రియల్ 8 వ కు ఏవారం అయిందో కాలెండరులో చూస్తాడు "8 వ తారీఖు మంచి రోజేమో కను క్కోవాలె" అనుకొని జయ మంచందగ్గర

కెళ్లి ఒక్కనిమిషం నుంచుని ఆలోచిస్తాడు. మళ్లీ అద్దం ముందు కొచ్చి, నూను కొంటాడు. మళ్లీ జయ దగ్గర కెళ్ళి లేపటానికి సిద్ధం అవుతాడు. వంగుతాడు. ముద్దు పెట్టుకోపోతాడు.

చప్పున నిశారున నిలబడి విశ్వామిత్రుడు మేనకను నిరాక రించే పోజులో చెయ్యిపెట్టి ఒక్కనిమిషంఉండి తిరిగి అద్దం దగ్గర కు పోతాడు. జయ ఈ అవస్థఅంతా చూస్తు నేఉంది చివరకు లేచి వస్తుంది )

జయ. — మీపనులన్నీ చూస్తునే ఉన్నా రావటం - ఉంగ టం - వెళ్లటం మళ్ళీరావటం అన్నీచూస్తునే ఉన్నా — ఏంబా గుండలేదు. చదువుబొత్తిగా మానేశారు.

బాబు — కుర్చీలోకూర్చుని తలొంచుకొని మాట్లాడడు

జయ — మీకే చెపటం -- వినపడుతున్నదా!

(బాబు మాట్లాడడు. జయ, బాబు గడ్డాన్ని మునివేళ్లతో నొక్కుతుంది) మిమ్మల్నే మిమ్మల్నేనండీ — చదువు బొత్తిగామా నేశారంటున్నా.

బాబూ — అంటున్నావు వింటునేఉన్నా ఏంచెయ్య మంటావూ!

జయ — ఏంచెయ్యమంటున్నానో ఇంకా తెలియలా కష్టపడి ... బాగా ...చదువుకోమంటా లేకపోతే తప్పుతారు

బాబు — (తనతొడమీదపలాగి కొట్టుకొని) — చదవరా ఇవ్వాళనుంచి అయినాచదువు. లేకపోతే ష్యూరుగా తప్పుతావు. (అని తనకుతాను చెప్పుకొంటాడు.)

జయ — మీకేమన్నా వెర్రిఎత్తలేదుగద

బాబు —(నవ్వుతూ) వెర్రి ఎత్త లేదుగాని ...

జయ — కానీ......

బాబు — కాని......అంటే వెర్రిఎత్తటంకాదూ. ఏదో పిచ్చి పిచ్చి గాఉంది —

జయ — దానిపేరే. అది. — (విరగబడినవ్వుతుంది) మీరు ఇల్లాగపిచ్చి చేష్టలు చేస్తే నేనూరుకోను. నేనుచూస్తునేఉన్నా మీరు రావటం — వంగటం వెళ్లటం – మళ్ళీరావటం ఇదేనా ఏమిటిచదవు !! నాకెందుకూ నేను మామగారితో చెపుతాను. (బాబు దీక్షగా చదువుతున్న నాడిలాగ కుర్చీలో కూర్చొని పుస్తకం తెరచి ముఖం ముందు పెట్టుకుంటాడు ... జయ క్రిందకి వెళ్ళిపోతుంది మేడమెట్లు తలుపు తెరచి ఉండటంచూచి పంతులు మెల్లగా మేడమెట్లు ఎక్కివస్తాడు దూరంగా నుంచుని చూచి కొడుకు చదువు కొంటున్నందులకు సంతోషించి క్రిందికి దిగే సరికి జయ ఒకచేత్తో మంచినీళ్ల చెంబూ, మరొక చేత్తో ఫలహారపు పళ్లెమూ పట్టుకొని వస్తూ ఎదురవుతుంది)

పంతులు — అయితే, జయా, ఇంత పొద్దు పోయినదాకా ఇక్కడే ఉన్నావా. అబ్బాయి పాపం చదువు కొంటున్నట్లుంది ఆటే పొద్దు పోయిందాకా చదవటమూ మంచిదికాదు. వాడు మరీపిచ్చినబడతాడేమో. నీవు కాస్త కనిపెట్టి ఉండమ్మా వెళ్లు. (అనిచెప్పి క్రింద హాల్లోపడుకొంటానికి వెళ్లిపోతాడు)

జయ — అల్లాగేనండి కానియ్యండి—(అంత అంతున వెళ్ళిపోయినాడా లేదా అని చూచి పెద్దగా) ఏమండోయ్ ఏమండీ ! మరీ ఒకళ్ళే చదువా? అదేపిచ్చిని పడకూడదని మామగారు కూడా అన్నారు. ఇక పడుకోండి — (అని విరగబడి నవ్వుతుంది)

## నాలుగో రంగం

(ఇంకోరోజు రాత్రి. అదే పడకటిల్లు — అలంకారాలూ అవీ మామూలు పద్ధతినే ఉంటాయి): బాబు పుస్తకం తెరిచి ముందు పెట్టుకొంటాడు- గదిబయట హాలులో జయ పడుకొని వుంటుంది.

బాబు — గాలి జోరుగా వీస్తున్నది. కాస్త కిటికీతలుపులు వేసి వెళ్ళు జయా.

జయ — కిటికీ తలుపులు వేయటానికి నేను రావాలటండీ. మీరు వేసుకోండురూ.

బాబు — అప్పుడే— నిన్ను లేపటం ఎందుకూ ? చదువుకొని పడుకొంటానుగాని నీవు మేలుకోక నిద్రపో.

జయ — అల్లాగే.

బాబు — మీాన పడుకోండా ?

జయ — ఆ అది తొమ్మిది గంటలకే పడుకొంది.

బాబు — అహా. (ఒక్క క్షణం ఉండి)
అయితే—

జయ — అయితేలేదు. గియితేలేదు మీరుచదువుకోండి.

బాబు — చదువుకోనూ మరి చదువుకోకపోతే తప్పుతా ను. తప్పితే నాన్నకు కోపం వస్తుంది. తప్పకుండా చదువుకొం టా—(అని పుస్తకం ముందుపెట్టుకొని దీక్షగా చదువుతుం టాడు. ప్రశాంత అయింతరువాత) — జయా నీవేంచది వినట్లుకనపడవేం ?

జయ — నాచదువు మీకేం కనపడుతుంది.

బాబు — నాన్నగారి కోరికసంగతి ఏంజేశావూ ?

జయ — నేను మీ మాస్టరుగాదండోయ్—చదువేమిటి అసలునేను మొదలుకోసమే ప్రయత్నము చేస్తున్నాను మామ గారి మనస్సు సంతోషిస్తుంది. చూడండి. నామాట అబద్ధమ వుతుందేమో

బాబు — చూద్దాం- చూద్దాం- (మళ్ళీ పుస్తకం చూ స్తూరెండు నిమిషాలు గడుపుతాడు) జయా.

జయ — అబ్బ ఎందుకండీ—అంతులేదగద మీ పిలుపు లకు ! ! !

బాబు — అదికాదు. శాలువ నాదగ్గరపెట్టావా ?

జయ — తలదక్కునేపెట్టా— అయినా ఉడకపోస్తుంటే శా లువమాట ఎందుకుచెప్పండి. ఇక మాట్లాడించకండి. నేను తెల్లవారుఝామున లేచి చదువుకోవాలె.

బాబు — సరే —సరే—ఎబ్బేనాకేంపని ఇకమాట్లాడిం చటానికీ !— (మళ్ళీరెండు నిమిషాల వ్యవధి.) జయా ?

జయ — అబ్బ ఎంత కండీ. ఇదేం చదువూ ?

బాబు — ఒక నిద్ర పోయిలేచావు. నేను చదువుతునే ఉన్నాను. అయితే మంచినీళ్లు ఎక్కడ పెట్టినట్టూ ?

జయ — ఏమో నాకు తెలియదు. మీ ప్రశ్నలకు నేను జబాబు చెప్పనూ లేనూ. చెప్పను

బాబు — చెప్పాలె. చెప్పకపోతే ఎట్లా తెలుస్తుంది.

జయ — అవసరం వచ్చినపుడు ఎవరూ చెప్పకుండా నే తెలుస్తాయి. అసలు నాదగ్గరుంది లెండి పోరపాటంతా ? నేను ఇక్కడికి రాకుండా ఉంటే మీ చదువు బాగాసాగుతుంది.

బాబు — నీవు రాకపోతే అసలే చదువుసాగదు. నీవు ఇక్కడ ఉండి ఏం కావాలంటే అది ఇస్తూ ఉంటేనే ఏమన్నా చదువు సాగటం. అయినా నాన్నగారు ఏంజెప్పారు. ఇక్కడుండి కనిపెట్టి చూస్తుండమన్లేదూ.

జయ — అందుకనే. మామగారు చెప్పినమాట వినకపోతే మహాపాపమనే. నేను ఇక్కడ ఉంటున్నాను—

బాబు— మామగారి ఆజ్ఞను శిరసావహించటమూ, భర్తకు అన్ని విధాలా విధేయత చూపటమూ అను ఈ రెండు పనులూకూడా పుణ్యకార్యాలు సుమా జయా

జయ — అయితే మీకు చదువుసాగటం ఎట్లాగో నాకు తెలియటంలేదు.

బాబు — ఇప్పుడు కొంత వరకు బాగానే సాగుతున్నది.

ఇంకా ఎక్కువగా సాగుతుంది కూడా నేను కొంచెం మనస్సు దిట్ట పర్చుకొంటే.

జయ — అదే, అదే నేనటం కాస్త ఆపనిచేయండి. మనస్సు గట్టిచేసుకోమనే నేనటం.

బాబు — చేసుకొంటాను — అంటున్నానుగా.

జయ — చేసుకొంటాను అంటానికేం — అంటునే ఉంటావు. నమ్మకం ఏదీ ?

బాబు — అయితే ఇప్పుడే మనస్సు గట్టి చేసుకోమంటావా.

జయ — ఆ

బాబు — అల్లాగే. మనసా నామాట వినుమా. నా ర్యాద కాపాడుమా. (స్వ) యౌవనం పాలపొంగు లాంటిది. క్షణభంగురం. పరుగెత్తిన కాలం తిరిగి పోతుంది. మిసమిసలాడుతూ ఉన్న ఈ శరీరం ముడతలు పడుతుంది — (అని, ఆగి బాబు జయవంక చూస్తాడు) (జయ నవ్వుతుంది) ముత్యాల కోవలాగున్న ఆ పలువరుస ఎడమిచ్చి చివరకు రాలిపోతుంది. (జయ నవ్వి ఆశ్చర్యంగా చూస్తుంది) తళతళ లాడుతూ ఉన్న ఆ కళ్ళు ఎప్పుడో ఒకసారి తేజోవిహీనం కాక మానవు. కాబట్టి ఓ మనసా. పిచ్చి ఊహలను కోరికలను పెట్టుకోకు. కామమా నను వీడిపొమ్ము. మోహమా నీకును నాకును ఋణము తీరినది. ఇంద్రియనిగ్రహశక్తి ఇక నిన్నే నారాధింతును. శాంతమా నా హృదయ పీఠమును అలంకరింపుము.

తమసో—మా—జ్యోతిర్గమయ

అని ప్రార్థనచేసి—కళ్ళు మూసుకొని తెరిచి చూస్తాడు సీరియస్‌గా జయమ్మ.

జయ — అబ్బ ఏమిటి వేళాకోళం అండీ!

బాబు — వేళాకోళం కాదు మనస్సు గట్టి చేసుకోమంటే చేసుకొన్నాను. ఇక చూశావా గుండె చాలా నిబ్బరంగా ఉంటుంది. ఘట్టిగా ఉంటుంది! అంటే ఇంద్రియనిగ్రహ మన్నమాట!

జయ — అయితే సరే. నే వెళ్ళుతా. (వెళ్ళబోతుంది)

బాబు — (ఆమెను కూర్చోబెట్టి) వెళ్ళుదుగాని లే ఉండు సంగతంతా విను. ఇప్పుడు చాలా గొప్పవని అయిపోయిందన మాట! నిగ్రహం సంపాదించాను. !!

జయ — సరే—(అని మళ్ళీ వెళ్ళబోతుంది)

బాబు — (మళ్ళీ బుజాలు పట్టి కూర్చో పెట్టి) ఏమిటో! మనస్సు ఎల్లా చెపితే అల్లా వింటుంది. చదువుకొనే వాడికి ఈ మాత్రం గుండె నిబ్బరం ఉండొద్దూ? ఏమంటావు?

జయ — (మళ్ళీ ఇంకోసారి లేస్తుంది) ఉండాలండి తప్పక ఉండాలి. ఇక నన్ను వెళ్ళనివ్వండి.

బాబు — (మళ్ళీ కూర్చోబెట్టి) — నీవు చెప్పినట్లు నే విన్నాను. చూశావా. మనస్సుకు బుద్ధి చెప్పుకున్నా గుండె నిబ్బరం కలిగింది! చూడు ఇంకా (అని ఆమె దగ్గరకెళ్ళి నిల బడు తాడు — ఆమె మాట్లాడక నవ్వుతుంది) — చూడు

మరి. గుండె ఎంతనిబ్బరంగా ఉందో — (అని ఆమె చెయ్యి పట్టుకొని తన గుండెపై ఆనించుకొంటాడు ! — నవ్వుతాడు)

జయ — నిజమే ! అబ్బ...ఎంత ఘట్టిగుండె అయిపోయిందండి నిమిషంలోకి — !! — (వేళాకోళంగా ఆశ్చర్యంగా) అంటుంది — గుండె అంతా తడివి చూచి జయ — మహా ఎక్కువగా ఆశ్చర్యపోయినట్లు నటిస్తుంది. మళ్ళీ మళ్ళీ ఎంత ఘట్టి గుండె అయిపోయిందండీ నిమిషంలోకి అంటుంది ; బాబూ చాలా గర్వంగా, ఘనకార్యం చేసిన వాడిలాగ ఛాతీ విరిచి ఆమె వంక చూస్తాడు —

తెర

# IV

## అయిదో రంగం

(హాల్లో బాబూ బల్లపక్కని కుర్చీలో కూర్చుని ఉంటాడు. కొంచెం దూరంలో జయ ఆతనికి ఎదురుగా మరో కుర్చీలో కూర్చుని ఉంటుంది. మీనా బావకు దగ్గరగా కూర్చుని కథల పుస్తకం చదువుతూ ఉంటుంది. సమయము ప్రొద్దున ఏడుగంటలు)

జయ — ఇంక ఎన్నాళ్ళో లేదు. మీ పరీక్షలు దగ్గరకొచ్చినై.

మీనా — ఇప్పుడేం పరీక్షలే అక్కా ! ఇంకా 4 నెలల మాట

జయ — అప్రసనుకో. అయినా చదవాలె.

మీనా — కష్టపడి చదువుతునే ఉండేగదే బావ !

జయ — నీవు సంతోషించాలె. (వెక్కిరింతగా).

బాబు — చూశావా మీనా. నేను చదవటం లేదూ ?

మీనా — ఏం మాటలే అక్కయ్యా అవీ ! పాపం చదువుతునే ఉంటే ?

బాబు — నేను సిన్న జ్యోతిషుడు దగ్గరకూడా వెళ్ళొచ్చాను. నాకు ఇవి శుభదినాలు. తప్పకుండా మేలు కలుగుతుందన్నాడు.

జయ — నక్షత్రం బలం చేతే ప్యాసు కావాలె. అయితే !

బాబు — నిజానికి అంతే. ప్యాసు కావటం అనేది కష్టపడి చదవటంలో ఉండదు. అదో గాలిపాటు.

మీనా — అంతే. అంతే. (అంటుంది పుస్తకం చూస్తూ).

బాబు — అయితే నీవు పరీక్ష కెళ్ళటం మాటా ?

జయ — డబ్బు కట్టారా ?

బాబు — కట్టలేదు, రేపు పంపుతామను కొంటున్నా.

జయ — వద్దు పంపబోకండి.

బాబు — ఏం, పరీక్ష కెళ్ళవా ?

జయ — ఊహూ...

బాబు — ఏం ?...

జయ — (మాట్లాడదు)

బాబు — చదవక పోతే మానే పరీక్ష కెళ్ళటం మంచిది.

అసలు ఆడ వాళ్ళను పొరకేనే ప్రాసు చేస్తారు.

జయ — అయినా వెళ్ళను.

బాబు — వెళ్ళాలె. తప్పదు.

(నవ్వుతుంది. అక్కయ్యనుజూచి...అక్కకూతురిని జూచి నవ్వుతుంది. బాబుకేం బోధపడదు. ఏదో గుట్ర అనుకుంటాడు.)

బాబు — ఇవన్నీ సాగవు. వెళ్ళి తీరాలె (అధికారిలాగ అంటాడు.)

జయ — అల్లాగే లెండి — (ఉదాసీనంగా)

మీనా — అబద్ధం, ఎందుకే అక్కాయ్. వెళ్ళనని స్పష్టంగా చెప్పరాదూ?

బాబు — ఎం వేళ వెళ్ళవు? వెళ్ళకపోతే నే నొప్పుకోను.

మీనా — నీవు ఒప్పుకోనేదేమిటి? అక్కయ్య పరీక్షకు వెళ్ళదు బావా. దాని తరువాత నీయిష్టం!!

బాబు — ఎందుకు వెళ్ళనోనాకు చెప్పకపోతే, నేనొప్పుకోను.

మీనా — చెప్పవే-అక్కా చెప్పు. చేసిన పాపం చెపితే పోతుంది.

జయ — పాపంలేదు గీపంలేదు?

మీనా— చెప్పవే (ఒకతిమిలాడిస్తూ —నవ్వుతుంది పెద్దగా)

జయ — ఏం జెప్పాలే ఏదో ఉన్నట్లు!!

బాబు — చాలా గొడవగా ఉందే వ్యవహారం—(విసుగ్గా) పరీక్షకు కూర్చుని తీరాలె. తెలిసిందా!

ఆ అదేనా...భావా...ఆ అదేనా...(అని వెక్కిరించి విరగబడి నవ్వుతుంది అదే నవ్వటం కాసేపు అయినతరువాత బాబు తెప్పరిల్లిచూస్తాడు)

బాబు — సరే. అయితే మీనా మీ అక్కయ్య పరీక్ష కెళ్ళటానికి బొత్తిగా వీల్లేదా?

మీనా —(వేళ్ళమీద లెఖ్ఖపెడుతూ)—కార్తీకం, మార్గశిరం, పుష్యం, మాఘం, ఫాల్గుణం—(అని ఒక్కొక్కమాటే మెల్లగా, వినీ వినబడని గొంతుకతో అని పెద్దగా) ఊఁహూఁ వీల్లేదు కానా—బొత్తిగావీల్లేదు.

బాబు — సరే. సరే. (అంటూ వెళ్ళిపోతాడు)

## ఆరో రంగం

(జయ అత్తగారిఇల్లు. హాలు. మీనా అటూ ఇటూ హడావుడిగా తిరుగుతూ ఉంటుంది. హాలుపక్కన గది పంతులు ప్రవేశం)

పంతులు — మీనా.

మీనా — ఏమండీ-మామయ్యా

పంతులు — లేడీ డాక్టరు వచ్చిందికదూ.

మీనా — ఆ వచ్చింది. ఇంకా పదినిమిషాలు.

పంతులు — మీ అత్తయ్య కూడా గదిలో నేఉంచా.

మీనా — అత్తయ్యా. గస్తేమ్మగారు—పిన్ని అంతా ఉన్నారు మామయ్యా. మీరు అల్లాగ కుర్చీలో కూర్చోండి గడియారం చూస్తూ వెళ్ళిపోతుంది. (పదినిమిషాలు అయినతర్వాత)

పంతులు — మీనా.

మీన — (లోపలినుంచి వచ్చి)-ఏం, మామయ్యా—ఎందుకూ పిలిచారూ?

పంతులు — తగ్గలేదూ—

మీన —లేదు మామయ్యా. లేడిడాక్టరు దగ్గరే ఉంది. మీరు ఊరికే ఆదుర్దాపడకండి.

పంతులు — నీవు నాదగ్గర ఉండు అమ్మా మీనా.

మీన — (నవ్వి) ఎందుకండీ మామయ్యా. మీకు కూడా నొప్పులొస్తున్నాయ్యా.

పంతులు — అంతకంటె ఎక్కువగానే ఉంది మీనా అక్కయ్య ఏమంటున్నది మీనా.

మీన — (వెళ్ళిపోతూ)—ఏమంటుందండి మామయ్యా పెద్దగానవ్వి.

రావే రావే బంగరు పాపా

(అంటూ పరుగెత్తుతుంది)

(మరిపదినిమిషాలైనతరువాత)

పంతులు — మీనా, మీనా.

మీనా — (లోపలినుంచే)—ఆ ఏం మామయ్యా.

పంతులు — ఏం?

మీన — ఏం, లేదు మామయ్యా-

పంతులు — లేడి డాక్టరుతో చెప్పు కాస్త జాగ్రత్తగా ఉండమని.

మీనా — ఆ అల్లాగే...

(మరి అయిదు నిమిషాలుతరువాత)—

పంతులు — మీనా. మీనా.

మీనా — ఆ వస్తున్నా మామయ్యా. (పరుగెత్తుకొని వచ్చి ముసలాయన చెవులో)—మామయ్యా ఇంకా అయిదు నిమిషాలట —(లోపలికి వెళ్ళిపోతుంది)

బాబు—(ప్రవేశించి)—నాన్నగారూ—నేను బి. ఏ. ఫస్టు క్లాసులో ప్యాసు అయినానండీ!

పంతులు — మాతండ్రే—మానాన్నే. ఫస్టుక్లాసులో ప్యాసు అయినావా? మాతండ్రే—!!

(లోపలినుంచి పసిపిల్ల ఏడ్పు వినవస్తుంది. బాబు ఆశ్చర్యపడి సిగ్గుపడుతాడు...)

పంతులు — మీనా. మీనా. మీనా.

మీనా — (పరుగెత్తుకొచ్చి).—మామయ్యా, ఫస్టుక్లాసులో ప్యాసు అయింది అక్కయ్య!.

పంతులు — మాతల్లె—మా నాన్నతల్లి. చల్లని కబురుచెప్పావు—బాబు ప్యాసు అయినాడనికూడా ఇప్పుడే విన్నాను.

మీనా — బావ, వచ్చేడే—బావా—అక్కయ్య పుడుతూనే కొట్టేసింది. ఫస్టుక్లాసు మెడల్—బంగారపు మెడల్—రత్నాల మెడల్—

బాబు — అరే!— ఏమిటే!— మీనా! అప్పుడే! తమాషాగా ఉందే—

మీనా — తమాషా-గాడు బావా!! చాలా తమాషా!!

ఏడవకు ఏడవకు-వెఱ్ఱి అబ్బాయి
ఏడిస్తే నీ కండ్లు-నీ లాలు కారు
నీలాలు కారితే-నేజూడ లేను జోజో

ఇంద్ర కన్యలొచ్చి-నిన్ను తే పేరు
చంద్ర కన్యలొచ్చి-పాట పాడేరూ.
నాగ కన్యాలొచ్చి-నాట్య మాడేరూ
దేవ కన్యాలొచ్చి-వీణ మీటేరూ
నిద్రపో పాపాయి-నిద్రపోవయ్యా.

---

# ఎలోప్‌మెంటు

—

## ౧

(' కాంతమ్మ, లక్ష్మమ్మ, పెద్దపిల్ల, చిన్నపిల్ల, శాస్త్రి, రాధ, విజయ, అంతా హాలులో ఉంటారు. కాంతమ్మ పెద్ద తల్లికి తలదువ్వుతున్నది. లక్ష్మమ్మ చిన్నపిల్లకు తలదువ్వు తున్నది. విజయ బొమ్మతో ఆడుకొంటున్నది. రాధా, విజయలు దూరంగా కారంసు ఆడుతుంటారు')

లక్ష్మమ్మ — ఏమిటో వదినా. చిన్నప్పుడు చేస్తేనే బాగుంటుంది బొమ్మల పెండ్లిళ్లలాగ. ముద్దు ముచ్చట తీర్చాలంటే చిన్నతనంలోనే, పెండ్లి చెయ్యాలె. గడ్డాలు మీసాలు వచ్చిం తరువాత పెండ్లేమిటి నాముఖం ! ఒక గంధంపూసినా, పూల చెండ్లాడినా పసివాళ్లు చేస్తే ముచ్చటగా ఉంటుందిగాని, వయస్సు వచ్చి ఆంబోతుల్లా తయారైన తరవాత ఏం పెండ్లి అమ్మా !

కాంతమ్మ — అవునమ్మా వదినా, ఆమాటనిజం. చిన్నప్పుడే అయితే, అల్లుడు, అత్తయ్యా అని పిలవటం ఆపేక్ష పడటం, ఉంటుంది. ఈడొచ్చిన పిల్లలకు పెండ్లిచేస్తే, ఆ మొగుడూ పెళ్ళాం అతుక్కుపోతారేగాని, అత్తకూ మామకూ అచ్చట్లు ముచ్చట్లు తీరవు. నాకు పెండ్లి అయినప్పుడు నేను

ఎనిమిదేండ్లదానిని. మేజువాణీలో పెండ్లికొడుకుకు గంధం పూస్తూ చెంపమీద ఛెళ్లున కొట్టాను. పసిదాన్ని నాకేం తెలుసు. ఎవరో చెప్పారు. అల్లాగ చేయమని.

లక్ష్మమ్మ—నా పెండ్లిలో ఏమైంది అనుకున్నావు వదినా... నీవు అప్పటికింకా కాపరానికి రాలేదు. జ్ఞాపకం ఉందో లేదో. పెండ్లి అయిపోయింది. మూడు నిద్రలకొచ్చినప్పుడేనా, ఆఁహాఁ. కాదు, కాదు మూడు నిద్రలు అయిపోయినై. పదహారు రోజుల పండుగనాడు. ఏమైందనుకున్నావ్. ఆయనేమున్నా నడవాలో మంచంమీద పడుకొని నిద్రపోతున్నారు. భోజనాలైన తరువాత. ఆయనకైనా అప్పుడు వయస్సు పదిహేనో, పదహారో వుంటాయి ఫిఫ్త్ ఫారంగాబోలు చదువుతున్నాడు. ఏమైందనుకున్నావ్ వదినా (నవ్వుతుంది)

కాంతమ్మ — చెప్పి నవ్వు. సంగతి తెలిస్తే మేమూ నవ్వుతాము.

లక్ష్మమ్మ—అప్పుడాయనకు పిలకుండేది. 'విరగబడి నవ్వుతుంది' నిద్రపోతున్నప్పుడే మెల్లిగా దగ్గరకెళ్ళి ఆ పిలకుకు తాడు గట్టిదాన్ని మంచానికి కట్టాను. (విపరీతంగానవ్వు). వెధవది చూశావా, ఎంతచిన్నతనమో (నవ్వు—ఆపుకొని) అట్లాగే....ఇంతకూచెప్పొచ్చింది ఏమిటంటే, చిన్నతనంలో పెండ్లిచేస్తేనే సరదాగా ఉంటుంది. మీ విజయ సూరారాముడు ఈడూ జోడుగా ఉన్నారు. ఉఁ...అదీగాకా... పరాయి సంబంధంకాదు మేనత్త మేనమామబిడ్డలూ...చక్కగా చిలకాగోరంకులా

ఉంటావు... నేనటం ఏమిటంటే వాళ్లిద్దరికి ముడి పెడదామని.

పెద్దపిల్ల — రాముడు బాగానే ఉంటాడే అమ్మా... చేస్తే బాగానే ఉంటుంది.

చిన్నపిల్ల — ఆ విజయ చచ్చింద్రీ. రాముడు వస్తే బండరాముడు, వాడ్ని వంగతీసి గుద్దుతుంది.

లక్ష్మమ్మ — రేపు నీ మొగుడ్ని నీవు—పూలల్లో పెట్టి పూజిస్తావేమో చూస్తాగా ?

రాముడు — ఏమే అమ్మా విజయను నాకిచ్చి పెండ్లి చేస్తారా ? నేను విజయను చేసుకొంటాన ! (అనిపెగుతును)

౨

(కాంతమ్మ ఇల్లు, పిల్లలతో-కాపురం. అంతాచిన్నవాళ్ళు ... రంగస్థలం వంటిల్లు.)

శాస్త్రి — అమ్మా. అమ్మా,

రాధ — పిలవబోకురా, అమ్మ దొడ్లో పూజచేసుకొంటూంది.

శాస్త్రి — చూడవే అమ్మా, పెద్ద అక్కయ్య చూడూ,

కాంతం — (దొడ్లోనించే) పెద్దతల్లీ, ఒక్క నిమిషం ఊరుకో అమ్మా పూజ చేసుకొనివస్తున్నాను.

పొడుస్తూ బాలుడూ పొన్న పువ్వూ చ్ఛాయ
పొన్నపువ్వూ మీద బొగడ పువ్వూచ్ఛాయ
శ్రీ సూర్యనారాయణా ?
మేలుకో హరి సూర్యనారాయణా.

శాస్త్రి — చూడవే అమ్మా అక్కయ్య నన్ను అధో గతివాడా అంటోంది.

పెద్దపిల్ల — నేనేమన్నారా, వెధవ అన్నీ కల్పించుకొంటావు, అధోగతి వెధవవు.

శాస్త్రి — అమ్మా చూడవే

కాంతమ్మ — వస్తున్నా, నాయినా వస్తున్నా ఒక్కనిమిషం పోట్లాడకుండా ఉండండర్రా

ఉదయిస్తూ బాలుడూ ఉల్లిపూపూచాఛాయ
ఉల్లిపువ్వుమీద ఉగ్రంపు పొడిచ్చాయ
శ్రీ సూర్యనారాయణ
మేలుకో హరి సూర్యనారాయణా
మధ్యాహ్న బాలుడూ మల్లిపువ్వుచ్ఛాయ
మల్లెపూపువ్వుమీద మంకెన్న పొడిచ్చాయ
శ్రీ సూర్యనారాయణ
మేలుకో హరి సూర్యనారాయణ.

విజయ — అమ్మా అమ్మోయి ... బావ చూడవే

కాంతమ్మ — (లోపలికొచ్చి) ఏమిటేపాపా, ఏమిటీ పిగోడవ ?

విజయ — బావ చూడమ్మా ఏమంటున్నాడో,

కాంతమ్మ — రాముడూ, ఏమన్నావురా, దాన్ని, దాన్ని ఏమన్నావు ?

రాముడు — నేనేమన లేదు అత్తయ్యా,

కాంతమ్మ — మరి ఎందుకు అవి పడుస్తుంటే

విజయ — ఏమిటో అసలేదేం, అబ్బాయింగారూచి తెలంగాణ ్రానూ.

రాముడు — (నవ్వుతాడు)

విజయ — అదిగో మళ్ళీ నవ్వటం ఎందుకేం ?

అందరు — (నవ్వుతారు.)

విజయ — అనుగోనే అమ్మా అంతా నవ్వుతున్నారు. నేను అన్నం తినను.

కాంతమ్మ — అట్లా చిందులుతొక్కుతా వెందుకే, నవ్వి తేనేం ? నవ్వారని అన్నం మానేస్తావా ? రా నాఅమ్మగదూ రా తల్లీ.

విజయ — ఊరికే నవ్వటం కాదే బావ చూడు.

కాంతమ్మ — మా తల్లిరా, నేను బావను కూకలేస్తానుగా, ఏమిరా రాముడూ, పాపనేమన్నావు ?

రాముడు — నన్నేమన్నదో కనుక్కో అత్తయ్యా.

కాంతమ్మ — ఏమన్నావే ? మాట్లాడవేం ?

శాస్త్రి — బావ బావ పన్నీరూ బావను పట్టుకుతొ స్నేరూ, అని పాట పాడిందేఅమ్మా

విజయ — ఆ . . పాడేను. పాడితే ఏం తప్పా ?

కాంతమ్మ — ఏంతప్పులేదమ్మా, ఓస్ ఇంతేకదా, ఆ, పాడితేవాడేమన్నాడే నీవుఏడ్వటానికి ?

విజయ — పాడితేఏమమ్మా, పాడితే బావనన్ను . . . ఎం

పోనాలేం !

కాంతమ్మ — ఏమన్నాడో చెప్పవేం ?

పిల్లలు — చెప్పా, చెప్పానుటే... (నవ్వుతారు), చెప్పా అంగిమూలి పడతావేం ?

విజయ — ఊఁ, ఊఁ, బావటానున్ను పెండ్లిచేసుకొని, నన్నెత్తుకెళ్తానుట ! (ఏడుస్తుంది)

కాంతమ్మ — ఓసే ఇదా ఇంతకూ సంగతీ, పెండ్లి అయినతరువాత సంగతిగదా ? దానికి యిప్పటినుండీ ఏడ్వటం ఎందుకు తే. అయినా ఇప్పటి కాలంలో పెళ్ళాలు మొగుళ్ళనే పట్టుకు తంతున్నారు.

విజయ — నేనే తంతా నిన్ను

రాముడు — పెండ్లిగానీ మరి

కాంతమ్మ — ఏమన్నాడే, మరీ ఇచ్చొత్తావు,, పగలు ఏహొత్తావు, పగలహూరి నంకాయవు, తినుతొంపరగా.

విజయ — బావా వాళ్ళంతా తినిపోయినారే అప్పుడే !

కాంతమ్మ — నీకు కూడా తినుమరి, వెళ్ళి వాళ్ళతో కలిసి తెచ్చుకొందువుగాని,

విజయ — బావదగ్గర మంచి బొమ్మలున్నాయి అమ్మా

కాంతమ్మ — టక్కరు లంజ, బావఅంటే ఇష్టమేమళ్ళీ!

సీత గుమ్మంలోనుంచి

వెండి కొండలా ఈశ్వరుడండీ

భమిడి కొమ్ములా బసవయ్యండీ

ఏడుకొండలా వెంకన్నండీ,

డూ, డూ, డూ, డూ, వెంకన్నా

అదిగో గంగిరెద్దు వచ్చింది. ఒక్క ముద్దతిను చెయ్యేదీ- ? చెయ్యికడుక్కోని వెళ్ళవే, పాపా ఇటురా మూతినిండా ఎంగిలే—ఊఁ ఇఁహ వెళ్ళు ...

3

("వంటిల్లు— కాంతమ్మ కూరలు తరుగుతూ ఉంటుంది. కాంతమ్మ ఆడబిడ్డ లక్ష్మమ్మ వంటింట్లోవుంది.")

కాంతమ్మ — ఇవ్వాళనీవు ముడికట్టుకున్నావు కాబట్టి నాకు కాస్త చెయ్యి తెరిపిఅయింది. రోజూనూ చాకిరీ చేస్తున్నా నేనూ పెద్దదాన్ని అయిపోయినాను వదినా, ఇంకచెయ్యలేను

లక్ష్మమ్మ — ముప్పై ఏళ్ళకే వచ్చిందా ఏం ముసలితనము! ముక్కలైన ముసలితనము! వెంట వెంటనే కాన్పులుకాబట్టి అయిదుగురు పిల్లలతల్లినైనావు కాని లేకపోతే నీకూ పైలా పచ్చీసు మీద ఉండాల్సిన వయస్సుకాదూ!

కాంతమ్మ — వయస్సా, నావయస్సే చెప్పాలె, ముసలి దానినై కూర్చుంటే.

లక్ష్మమ్మ — అప్పుడే ఏమైంది వదినా, ఇంకా కోడళ్లు రావాలె, అల్లుళ్లురావాలె. నడుంవంగాలె, (నిట్టూర్పులతో)

కాంతమ్మ — నిజానికి అంతేగాని నేనుమటుకు పేద ఇంటి పిల్లనైనాసరే, నాకుకాస్త చేతికక్కర కొచ్చే పిల్లను

చేసుకోవలెనని ఉందివదినా ?

లక్ష్మమ్మ — కోడలొస్తే మటుకు అక్కరకొస్తారా? ఏమి టో మనమనుకోటమేకాని అది వచ్చేసరికి, అత్తకూ పుడు తుంది నిమ్మ—ఏదోపాటంవుంది ఎరుగవూ ?

కొడుకు పుట్టాడంటె కొండకెక్కుదురు,

కోడలొచ్చిందంటె రచ్చకెక్కుదురూ...అనీ

అయితే ఏదో మాటొచ్చింది కాబట్టి అంటున్నాను వది నా. పెద్దపిల్లలిద్దరూ, మా రాముడికి ఈడుగా పోయిందీ, ఈవిజయను మారాముడుకిచ్చి పెండ్లిచెయ్యాలె. మాఅన్న య్యాతో వియ్యం పొందాలని నాకు చిన్నప్పటినుంచీ కోరిక ఏం వదినా ?

కాంతమ్మ — నాదేముందమ్మా, మీా అన్నయ్య ఇష్టం. మీాఇష్టం.

లక్ష్మమ్మ — ఏం శాణితసమమ్మా, బొత్తిగా నీపెత్త నంలేనట్టే మాట్లాడుతావు. అయినా నిజానికి మా అన్న య్య దేముంది ?

కాంతమ్మ — ఇవ్వటానికి నాకేంఅభ్యంతరం లేదు వదినా రాముడికి చదువు చెప్పించు. వాడుగనక స్కూలుఫైనల్ ప్యాసు అయినాడా తప్పకుండా విజయనిచ్చి ముడేస్తా.

లక్ష్మమ్మ — ఏమోనమ్మా యింగ్లీషు చదువులేమి చె ప్పిస్తామో, పల్లెటూరి వాళ్ళం, ఆడొళ్లో వున్నంత చదువు చెప్పిస్తాం. ఆపైని బస్తీకాపురం పెట్టి చెప్పించడానికి ఆయన

ఏమంటాడో.

కాంతమ్మ — చదువు లేకపోతే పిల్లనియ్యమన్నావా వదినా.

లక్ష్మమ్మ — ఇప్పుడు ఈ చదువులు రక్షిస్తున్నాయి. మా అన్నయ్య చదివాడు బి. యే. బి. యల్. ఏంలాభం— రేపు మా అబ్బాయి చదివినా అంతేగా.

కాంతమ్మ — ఏం లాభం లేకేం, నెలకు నూరురూపాయలు సంపాదిస్తున్నారు

లక్ష్మమ్మ — సంపాదిస్తున్నాడు (ఈసడింపుగా) నా సొమ్ము సంపాదన అంతా బూబుకుట్టుపోగులకుసరి. సెంటు భూమి లేదూ. చారెడు గది లేదూ తలదాచుకొంటానికి.

కాంతమ్మ — ఏం ఎక్కిరిస్తావు వదినా, మీకు కొంగా పది ఎకరాల భూమి ఉందనీ, భూమి ఉంటే ఏం లాభం. తినటం ఆకుక్కిమంచంలో కూర్చుని ఊగటమేగా, సగ మంచలోకి వెళ్లటమూ, మన్ననా! మర్యాదా ?

లక్ష్మమ్మ — మన్ననా మర్యాదా ఉన్నాయి మా అన్నయ్యకు...ఏంలాభం పట్టుమని పది రూపాయలు కావాలంటే పెట్టెలోవుండవు. అర్ధరాత్రివేళ వచ్చి అడిగినా మీఅన్నయ్య ఇనప్పెట్టెతీసి నాలుగొందలు అయిదొందలు, ఎంతకావాలంటే అంత, దొంతర్లుదొంతర్లుగా తీసి ఇయ్యగలడు. ఏమిటో బస్తీ. సంపాదనంతా అదో చిత్రం. నాలువందలు సంపాదిస్తున్నా, ఆయనకూడా మంగలికికూడా చేపిస్తానుపోరా, అంటాడు.

కాంతమ్మ — అవునమ్మా వదినా. మాదగ్గర డబ్బులే

నీమాట నిజమే. ఏదో సంపాదించుకొంటున్నాం. తింటున్నాం ఏన వాన్నేమే. మాపిల్లను నీవు చేసుకోకు. నీపిల్లను మాకీయ్యకు. అంతేగా.

లక్ష్మమ్మ — అదేమిటి వదినా అల్లా అంటావు. మారా ముడికి చదువురాదని నీవేగా పిల్లనియ్యనన్నావు. నేనుచేసుకోనన్నానా ?

కాంతమ్మ — చదువుకొంటే వాడికి ఇస్తాను. చదువుకోకపోకపోతే ఇయ్యనిమాట నిజమే.

లక్ష్మమ్మ — పోన్లె వదినా. ఇయ్యకపోతే పెండ్లికాకపోదూ. ఏదో అన్నయ్యకూతుర్ని చేసుకొందామనుగాని, మా వాడికి రేపాటికి బంగారపు బొమ్మలాంటి పిల్లను చేస్తాను.

కాంతమ్మ — అమ్మో, అదేమిటి వదినా, ఆమాత్రానికి అల్లా ఇదైపోతావేమమ్మా ! అయినా ఎప్పటిమాటో. భగవంతుడు, సరిగ్గా చూస్తే ఇంకా అయి దారేండ్లమాట ఊరికేనీవు ఇదౌతావేమిటి? అయినా వాడికి చదువురాదని నీవు అనుకోటం ఎందుకూ ! నిక్షేపంలాగ వస్తుంది. బియ్యే ప్యాసు అవుతాడు. అప్పుడు నేను విజయనిచ్చి పెళ్లిచేయకమానను.

లక్ష్మమ్మ — ఏమో నీమాట చలువను అంతే నాడుకావాలగదా! ఇప్పుడు, ఆకుంక నాలుగో క్లాసట. తప్పాడు వెధవ క్రిందటి సంవత్సరం.

విజయ — (అప్పుడే ఆమాటవిని) బావ నాలుగు తప్పాడు అత్తయ్యా (నవ్వి)

తప్పాడు, తప్పాడు, నాల్గో క్లాసూ తప్పాడూ
చదవాడూ, చదవాడూ, పాఠాలేమీ చదవాడూ
మెక్కాడూ మెక్కాడూ. చక్కిలాలూ మెక్కాడూ.
బొక్కాడూ బొక్కాడూ అటుకులన్నీ బొక్కాడూ.
తింటాడూ తింటాడూ తేరతిండి తింటాడూ
ఆడాడు ఆడాడు అల్లరిపిల్లల గూడానూ
కొట్టాడూ కొట్టాడూ ఆటలో అబ్బాయ్యను కొట్టాడూ
అప్పుడు వాళ్లనాన్నా వచ్చాడూ
బెత్తం ఒకటీ తెచ్చాడూ,
స్తంభానికి కట్టాడూ

'అని పాడుతూ వెళ్ళిపోతుంది'

లక్ష్మమ్మ — ఇదెప్పుడొచ్చిందమ్మా వదినా

కాంతమ్మ — నేనూ చూడలేదూ వదినే, దీన్ని చేసికొని నీవే సుఖపడతావమ్మా!

లక్ష్మమ్మ — మరేం ఫరవాలేదూ. పెద్దైతే అన్నీ పోతయి. ఒక పిల్లపుట్టిందాకా ఇట్లాగే ఉంటుంది ఎగురుడు. వదినా నీవెళ్ళి పిల్లలకు నీళ్లు అవీ పోసుకో పొద్దుకూకివస్తున్నది. అన్నమైనట్లుంది నేనే వంటచూస్తాను. నీవెళ్లు.

౪

(ఇంట్లో ముందున్న పెద్దహాలు రంగ స్థలము. మేడపైన పిల్లలంతా ఆడుకొంటూంటారు. రాముడు, విజయ హాలులో

ఉంటారు. విజయ బొమ్మల పెండ్లి చేస్తున్నది.)

విజయ — బావా నీకు పెండ్లిమంత్రాలు వచ్చా ?

రాముడు — ఎందుకే విజయా

విజయ — బొమ్మలు పెండ్లి చెయ్యాలె. అన్నీ సిద్ధమైనవి. బ్రాహ్మణుడొకడు లేడు.

రాముడు — బొమ్మలపెండ్లి ఎందుకుగానీ. నిజంపెండ్లి చేద్దామూ ?

విజయ — నిజం పెండ్లి ఎట్లాగూరా చేయటం ?

రాముడు — మనం ఇద్దరం పెండ్లి చేసుకొంటిమా, నిజం పెండ్లి అయిపోతుంది.

విజయ — మన ఇద్దరికీ పెండ్లా , బలే తమాషామాట అన్నావే. ఇందాకా అమ్మానాన్నాకూడా ఈ మాటే అను కొన్నారు.

రాముడు — ఏమనుకొన్నారే విజయా చెప్పవూ ?

విజయ — మా నాన్న, నన్ను నీకిచ్చి పెండ్లి చేస్తానన్నాడు. మా అమ్మ వద్దన్నది.

రాముడు — అవునే విజయా , మా అమ్మకూడా నన్నే పెండ్లిచేసుకోమని నాకెన్నోసార్లు చెప్పింది.

విజయ — ఆఁ హా

రాముడు — ఆఁ హా కాదు. మరి నీకిష్టమేనా ?

విజయ — అమ్మ వద్దన్నదిగా ?

రాముడు — అత్తయ్య వద్దంటే ఏం లేవే. మనం ఇద్దరం

దూరంగా వున్నా నాకేం భయంలేదు.

విజయ — మెడ్రాసు దాటిన తరువాత ఏముందీ బావా !

రాముడు — అక్కడ పెద్ద సముద్రం ఉంది.

విజయ — (ఆశ్చర్యముతో) పెద్ద సముద్రమా ! ఒందరు సముద్రానికన్నా పెద్దదా ?

రాముడు — ఇక్కడ సముద్రం నీవు చూశావా ?

విజయ — నా అమ్మ సముద్రస్నానానికి తీసికెళ్ళిదింలే.

రాముడు — ఇక్కడ సముద్రమా ఏముందిలే. నెధవది. అవతలొడ్డుకనిపిస్తూనేఉంటుంది.

విజయ — అవతలొడ్డు కనిపిస్తుంది ? ఆ తెలివిగలవాడివె?

రాముడు — కనిపించకేమే ; నీవు చూశావా పెట్టావా ? మద్రాస్ దగ్గర సముద్రం అంటే... అదే అసలు నిజమైన సముద్రం. ఎంత పెద్దదనుకొన్నావేమిటి ? అబ్బ చెప్పలేం. తల కాయగిర్రున తిరిగిపోతుంది.

విజయ — (ఆశ్చర్యంతో) అబ్బ గుంటూరులో ఉందిరా సముద్రం.

రాముడు — గుంటూరులోనా, ఆ ...... గుంటూరులో సముద్రంఅదో తమాషా సముద్రం.

విజయ — ఏమిటి ? ఏమిటి తమాషా చెప్పవు

(దగ్గరకు వస్తుంది)

రాముడు — అదోతమాషాలే. ఇన్ని సముద్రాలున్నా యీ గుంటూరుసముద్రం లాంటిది నేనెక్కడాచూడలేను.

విజయ — తమాషా ఏమిటో చెప్పరాదో యిన్నూ ఊరికే ఊరిస్తావుకానీ.

రాముడు — అదిఏమిటంటే చెప్పనా ? సముద్రంలో నీళ్లు ఎల్లా ఉంటాయి చెప్పు.

విజయ — నల్లగా ఉంటాయి.

రాముడు — అక్కడే నామరి. గుంటూరు సముద్రంలో నీళ్ళు ఎర్రగా ఉంటవి.

విజయ — ఎర్రగానే—అంటే కుంకంలాగ ?

రాముడు — కుంకం ఏమిటే...రక్తంలాగ.

విజయ — అయ్యోబాబో... రక్తంలాగ ఎర్రగా ఉంటయ్యన్నమాట ! తాతయ్యగారింటికి వెళ్ళినప్పుడు నేను అది చూడలేదురా.

రాముడు — నీవేంచూస్తావ్. ఆడపిల్లవు మామయ్యతో పాటు ఇంట్లో ఉంటావు. కాకపోతే ఎక్కడికైనా పేరంటానికి వెడతావు. అంతేగా ? మామయ్యకు అసలే భయం నిన్ను ఎక్కడికైనా తీసికెళ్ళటానికి, మనంఇద్దరం వెడదాంరా ? నీకన్నీ చూపిస్తా. ఆసముద్రం కొండలు అవన్నీ చూపిస్తా

విజయ — నీవు ఎప్పుడన్నా కొండ ఎక్కావ్ బావా ?

రాముడు — ఓ. కొండ చివారుకొమ్మకెళ్ళా.

విజయ — కొండలకు కొమ్మలుంటాయా, (నవ్వు)

రాముడు — కొమ్మంటే ఆచివరకెళ్లానన్నమాట.

విజయ — అమ్మో భయమేయలేదూ ?

రాముడు — మొగాళ్ళకేం భయం... నిన్నుకూడా తీసి కెడతా, రా

విజయ — అమ్మయ్యో, ? నేను కొండ మీదికి రాను బాబూ, ఆచివర ఏముంటుంది. అక్కడ నుంచి మంటూ జారిపోలేనా ? పడిపోనా ?

రాముడు — ఆచివర ఎట్లా ఉంటుందనుకొన్నావు.?...అదో తమాషాగా ఉంటుంది. నీవైతేనా కళ్ళుగిర్రున తిరిగి పడిపోతావు.

విజయ — మరి నీవెట్లా ఉన్నావు?

రాముడు — మరి నీమోస్తరు నేను ఆడపిల్లనా? మరి ఆ కొండ ఎక్కుతుంటే...పెద్దపులులు అవీ అరుస్తూఉంటం వినపడుతుంది.

విజయ — పెద్దపులులే—అయ్యబాబో!—నేను రాను బాబూ. నేను అసలు రాను.

రాముడు — ఓసి, ఊరికేనే భయపడతావేమే. పగలు ఉండవు అవీ! రాత్రిళ్లు తిరుగుతూఉంటవి.

విజయ — రాత్రిళ్లుమనం అక్కడికి పోగూడదన్నమాట.

రాముడు — ఆఁహో...అయితే తుపాకి అవీ ఉంటే వెళ్ళి వాటిని చంపొచ్చు.

విజయ — నీవు చంపగలవ్వా పెద్దపులిని?

రాముడు — నేనా? పెద్దపులినా? రాత్రిళ్లా ఆఁహో చిన్న

పిల్లలు చంపలేరే! పెద్దఅయిన తరువాత తప్పకుండా చంపుతా. అసలు పెద్దపులులను సింహాలను వేటాడాలని నాకు సరదా.

విజయ — పెద్ద అయిన తరువాత చంపుతావా?

రాముడు — ఓ .....

విజయ — తాతయ్యగారింటికెళ్ళితే తాతయ్య కొప్పడ్డు?

రాముడు — తాతయ్య ఏం కోప్పడ్డు. బలే సంతోషిస్తాడు. మా నాయినే, మా అమ్మో, అంటూ ఎత్తుకొంటాడు. కానేప్పు అయిన తరువాత తాతయ్యా, తాతయ్యా, మేమిద్దరం పెండ్లి చేసుకొంటాంఅని చెపుదాం తాతయ్య మన్మాటకి లగ్నం కుదిర్చి జైమంటూ పెండ్లిచేస్తాడు.

విజయ — అమ్మ, నాన్న రావద్దా?

రాముడు — అన్ని సిద్ధం అయిన తరువాత వస్తారు.

విజయ — వచ్చి కోప్పడరూ?

రాముడు — పెండ్లిఅయిపోయిన తరువాత ఏం జేస్తారు?

విజయ — నిజం పెండ్లేనా?

రాముడు — ఆ, నిజం పెండ్లే!

విజయ — బాజాలూ మరి?

రాముడు — బాజాలూనూ!

విజయ — గాసు లైట్లూ?

రాముడు — గాస్ లైట్లేం కర్మం! ఎలక్ట్రిక లైట్లు పెట్టిద్దాం.

విజయ — మరి మనకు కొత్తబట్టలూ?

రాముడు — తాతయ్య కొని ఇస్తాడు.

విజయ — అవునురా? బలే తమాషాగా ఉంటుందిగదూ?

రాముడు — గమ్మత్తు. మరి వెడదాం ఎవరికీ తెలియకుండా

విజయ — అమ్మో మరినాకు ఆకలై తేనో?

రాముడు — నా దగ్గిర డబ్బు ఉందిగా, ఇదిగో

విజయ — అయ్యబాబో ఎక్కడదమ్మా ఆనోటూ?

రాముడు — ఎక్కడో సంపాదించాను. వెడదాంరా. నీకు బొమ్మలూ అవి కొనిపెడతాను.

విజయ — మొగ్గలేసే బొమ్మకొంటావా?

రాముడు — ఒక్క మొగ్గేసేదేనా? మొగ్గలేసేవీ, ఉయ్యాలలూగేవీ డ్యాన్సు చేసేవీ, అవన్నీ కొంటా?

విజయ — నిజంగా?

రాముడు — వెడదాం—మరి ఎవ్వరితో చెప్పకుండా?

విజయ — అమ్మతో చెప్పిరానా?

రాముడు — ఛా దద్దమ్మా, చెప్పిందంతా విని అమ్మతో చెప్తానంటావేం. చెపితే మన పెండ్లికాదు, పైగా రెండుతంతుంది.

విజయ — మరి ఎవరితో చెప్పేది?

రాముడు — పిచ్చిమొద్దూ? ఒకరితో చెపటం ఎందుకూ? వెళ్ళిపోదాం.

విజయ — ఒక్కళ్ళమే. నేను రాను.

రాముడు — ఛా తమాషాగా వెడదాంరా.

విజయ — అమ్మగనక ఏమన్నా అన్నదా అంటే నీమీద చెప్తానన్నాయ్.

రాముడు — ఓ. ఏమన్నా చెప్పు—నేను కాదనను......

నేనే—నిన్ను...పెండ్లి చేసుకొంటే..................

నీవు...నాకూ ఏమవుతావూ?

విజయ — నీవు నాకూ మొగుడవురా.

రాముడు — నీవూ నాకూ పెళ్ళానవే. 'తెర'

౫

(స్థలం మేడపైన గది. గదలో విజయ ఉంటుంది అప్పుడే స్నానంచేసివచ్చి బట్టమారుస్తూంటుంది. రాముడూ స్నానంచేసి మంచి బట్టలు వేసుకొన్నాడు. నిక్కర్ తొడిగాడు. పైన తెల్లని షర్టు కాలరుపైకి నెట్టి స్పోర్ట్సుమెన్ లాగా తయారయినాడు పచారుచేస్తూ)

రాముడు — 'రిస్టు వాచి చూచుకొని' ('స్వ') రాదే. ఇంకా ఈవిడ. సాయింత్రం ఆరు గంటల బండి అందుతుందో, అందదో ఆబండి తప్పితే ఇంకో బండి ఉండదుగాని ఇంతిలోకి మామయ్య వచ్చినా, కథ అడ్డంతిరుగుతుంది. లేకపోతే అత్తయ్యకు ఆచూకీ సోకెనా పక్కలు విరగపొడుస్తుంది. ఈయిద్దరికీ అందకుండా, సంజె చీకట్లో దొడ్డి గుమ్మానె ఉడాయించాలె. ఇంకా ఈవిడ రాదేం? ('ప్ర') విజయ లక్ష్మీరాణాసాహెబా

వారు...సుహాసాణిచారూ, కదిలి రండమ్మా, అమ్మగారి సింగారం పూర్తి అయిందా?

విజయ — (ప్రవేశించి)అథార్టీ చేస్తున్నావే అప్పుడే?

రాముడు — పెండ్లాం మీద అథార్టీచెయ్యరాదేమిటి? మొగాళ్ళు.

విజయ — అబ్బో మహాదొడ్డ మొగాడివి దిగొచ్చావు లెద్దూ? అసలు నీకు నేనూ...పెళ్ళాన్ని అయితే కద.

రాముడు —నీవు నాకు పెళ్ళానివి కాదూ?

విజయ — కాదు, నేను నీపెళ్ళాన్ని కాదుపో.

రాముడు — ఎంచేత?

విజయ —నీకూ నాకూ ఇంకా పెండ్లికాలేదే?

రాముడు — ఒస్ ఇంతేకదా, రేపు అవుతుంది.

విజయ — అవుతూంది, అవుతూంది—అబ్బాయికి పెండ్లి ఎట్లాగుఅవుతుంది.

రాముడు — కాకపోయినా నాకు కాబోయే పెళ్ళానివి కాబట్టి నీమీద నాకు అథార్టీ ఉంది తెలిసిందా? కాబట్టి అథార్టీ చేస్తాను.

విజయ — చేస్తావు, చేస్తావు, చేస్తేఎరగవూ ?

రాముడు — ఏమిటేవ్ విజయా, నీవు జూస్తే పెంకెమనిషిలాఉన్నావే! నేను నీకు మొగడ్ని, కాబట్టి నేను చెప్పినట్లు నీవు వినాలె.

విజయ — నేను వినను—నీవు నాకు మొగుడివి కాదుఫో.

రాముడు — అమ్మబాబో నేను నీతో వేగలేనే. అయితే ఇంతకూ ఒక్కటిచెప్పూ నీవు నాకు పెళ్ళానివి అవునా కాదా, అసలు ఆసంగతి చెప్పూ?

విజయ — కాను. నేను నీపెళ్ళానిని కానూ (నీర్లాటుతీస్తూ)

రాముడు — అట్లాగయితే ఎట్లాగమ్మా, ఇందాక సగే నంటివే గుంటూరు వెళ్ళి గమ్మత్తుగా పెండ్లిచేసుకొందాం అంటివిగదే, మళ్ళీ ఇప్పుడిదేమిటమ్మా ('దగ్గరకు వెళ్ళి') ఏమే విజయా?...('మెడమీద స్నేహపూర్వకముగా చేయివేసి') మరి నన్ను పెండ్లి చేసుకోవా?

విజయ — చేసుకుంటా.

రాముడు — అదిగో విజయ ఎట్లాగైనా మంచిదే. విజయ చాలా మంచి పిల్ల. అందరి పిల్లల్లోకి విజయ మంచి పిల్ల. అన్ని నబ్బుల్లోకి నల్లనబ్బు మంచిది. విజయా మరి బయలుదేరూ వెడదామూ.

విజయ — ఎక్కడికీ?

రాముడు — మళ్ళీ ఎక్కడికి అంటావేమే? గుంటూరు వెళ్ళటం, పెళ్ళిచేసుకోటం. అదంతా అనుకొన్నాంగదే.

విజయ — అమ్మో నేను గుంటూరు రాను బావా, నీకు కోపం వస్తే వచ్చింది. అమ్మకోపం వస్తుంది చెప్పకుండా వెడితే.

రాముడు — అయితే నీవు రావా?

విజయ — రాను ...'నవ్వుతూ,

రాముడు — అయితే నామాట వినవన్నమాట.

విజయ — వింటా.

రాముడు — అదీ జయరాణి ఎట్లాగయినామంచి పిల్లే!

జయ ఎంతో మంచి పిల్ల
గయ్యాళి, గయ్యాళికాని పిల్ల
కయ్యాలు, కయ్యాలు లేని పిల్ల
జయ ఎంతో మంచి పిల్ల.

ఏమే జయ నీవు మంచి పిల్లవు కావ్రా?

విజయ — మంచిదాన్ని.

రాముడు — ('ముద్దుపెట్టుకొని') నేనో ?

విజయ — నీవ్వా మంచి వాడవే.

రాముడు — మరి నేను చెప్పినట్లు వింటావా ?

విజయ — ఊహు

రాముడు — ఇందాక వింటానంటివి కదే ?

విజయ — వింటా, వింటా, ఊహు, వినను, ఊఁ పోన్లే వింటానురా బావా వింటానులేరా.

భిక్షుక బాలుడు — ముక్కు పచ్చలా — చిన్నాదానా
ఎక్కుతావా రైలూ బండీ
చక్కదనమూ — చూచినన్నా
ఎక్కడివాడో — జాతీవాడూ—(అని పాడుతూ ఉంటాడు.)

విజయ — 'భయంతో' నీకేం తెలుసులే బావా, అమ్మతో చెప్తాడేమో !

రాముడు — ఛా. వాడెవరో పాడుకొంటూ పోతున్నాడు బజార్లో. నీకే భయం. ఇహ బయలు దేరుదాం.

విజయ — అమ్మో నాకు భయంగా ఉంది బావా.

రాముడు — నీకేం భయం లేదు. నేనున్నానుగా, దొడ్డి గుమ్మం దగ్గరుంటా నేను ముందెళ్లి. నీవు మెల్లగా ఎవ్వరూ చూడకుండా వెళ్ళిపోయిరా ఏం ?

విజయ — సరే ముందు నువ్వెళ్ళు.

పంతులు — (ప్రవేశించి) విజయతల్లీ ఎక్కడికమ్మా వెళ్లు తున్నావ్రా ?

విజయ — (భయంతో) ఎక్కడికి లేదు నాన్నా.

పంతులు — చీకటిపడ్డది. దొడ్లోకి పువ్వు పురుగూబుట్రా) ఉంటాయి. అయితే అమ్మాయీ నాజేబులోనుంచి ఏదైనా తీశావా నువ్వు ?

విజయ — నేనేం తీయలేదు నాన్నా, నేనేం చేసుకుంటానూ ?

పంతులు — మరి ఏమైపోయిందే పదిరూపాయలనోటూ, పొద్దుటినుంచీ వెతుక్కొని చస్తున్నాను. తీస్తే నువ్వే తీయాలి ఎప్పుడన్నా కానీ అర్ధనా తీస్తూవుంటావు.

విజయ — నోటు నాకెందుకు నాన్నా, నేను నోటు తీస్తే నేమిటి ?

పంతులు — ఎవరి దగ్గరైనా నోటు చూశావా ? పోనీ

అని చెప్పు ?

విజయ — చిన్న కాయితం గదు నాన్నా ?

పంతులు — ఆ, ఆ, ఇంత కాయితం.

విజయ — దాని మీద అక్షరాలుంటవి !

పంతులు — ఆ, అదే ఎక్కడుంది ?

విజయ — అది స్త్రే పూపాయిలిస్తారుకదు నాన్నా ?

పంతులు — ఆ, అదేనే ఎక్కడుంది, ఎవరు తీశారు ?

విజయ — ఏమో నాన్నా

పంతులు — భడవా, నీకేదో తెలుసు నిజం చెప్తావా, చెప్పవా ? ('చెయ్యెత్తి కొట్టబోతాడు')

విజయ — నేగాదు నాన్నా తీసింది.

పంతులు — పోని ఎవరు తీశారో చెప్పు ?

విజయ — ఎవరుతీశారో నాకు తెలియదు నాన్నా. కావ దగ్గర అటునంటి దొకటుంటే చూశాను.

పంతులు — అసిభడవా, ఇంతాకటినుంచీ ఆమాట చెప్ప వేం ? ఏదీ వెధవ ? ఎక్కడున్నాడు.

విజయ — దొడ్డిగుమ్మం దగ్గరున్నాడు.

పంతులు — రా, చూపిద్దువుగాని రా వెధవ దొంగతనం కూడా నేర్చాడూ ?

('నిష్క్రమణం,)

. . .

పిసిటీను — 'దొడ్డిగుమ్మం దగ్గర ప్రవేశించి' బావా ?

రాముడు — ('గొంతుబిగబట్టి గుసగుసగా పట్టుగా')
రావే, విజయా, గుంటూరు బండికి టైమ్ అయింది...

పంతులు — (ప్రవేశించి) 'రాముణ్ని చెయ్యిపట్టుకొని' ఏమిట్రా, ప్రయాణమా? ఇద్దరు కలిసి వెడదామనుకొన్నారా, ఓరి వెధవా, నోటేది ?

రాముడు — ఏం నోటూ ? నేనేమెరుగుదునూ ?

పంతులు — నా జేబులోంచి నోటుతీయలా ?

కాంతమ్మ — వాడేమెరుగునండీ, పాపం అన్నీ కొన్ని బోతాడూ, చిన్న వెధవనూ ?

విజయ — నోటు తెచ్చాడే అమ్మా, నేను చూశాను. నాకు చూపాడు కూడాను. మనమిద్దరం గుంటూరు అత్తయ్య గారింటికి వెడదాం అన్నాడే. మనమక్కడ పెళ్ళి చేసుకుందాం అని కూడా అన్నాడే అమ్మా.

పంతులు — నీవూ కూడా వున్నావుటే ఈ కుట్రలో ?

విజయ — నేనేమెరుగను నాన్నా బావే నన్ను గుంటూరు తీసికెడతానంటే నేను రానన్నాను నాన్నా.

కాంతమ్మ — కాసేపు మీరు రాజీపోయి ఒప్పుకుంటే కట్నమూ కానుకా లేకుండా, మీ కూతుర్ని ముడిపెట్టొచ్చేవాడు. ఇంతకూ నోటు మీ చేతికొచ్చిందా ?

పంతులు — రాలేదు. వాడేం ఎరగట్టి !

విజయ — బావదగ్గర నోటు వున్నది నాన్నా.

పంతులు — ఏంరా రాముడూ ?

రాముడు — నేను తియ్యలేదు—ఇంకోనోటు నేను తియ్యలేదూ —

శంతులు — తియ్యలేదూ, వెధవా తీయందే ఎట్లా వచ్చింది నీకగ్గరకు ? (ఒక దెబ్బ కొడతాడు)

కాంతమ్మ — వాణ్ణి కొడతారెందుకూ ? మీరాటిట్లా ఉండండి. ఏమిట్రా రామూ నోటు నీవు తీశావా ?

రాముడు — నేను తీయలేదు అత్తయ్యా ...మామయ్యా గదిలోనే కింద పడేసుంది అనోటు. ఎవరన్నా తీస్తే ఎత్తికెడ తారని నేను తీసు కొన్నాను.

కాంతమ్మ — ఎంత బుద్ధిమంతుడివిరా మాతండ్రి.

శంతులు — ఛా. గాడిదా అబద్ధాలు కూడాను. తన్నే వాళ్ళులేక (ఇంకో దెబ్బ)

కాంతమ్మ — ఊరుకోండి. చెయ్యిచేసుకోటం ఎందుకూ ?

విజయ — అక్కయ్యా రా, దబ్బున రావాలె. చిన్నన్నయ్యా, పెద్దన్నయ్యా అరెరె, చప్పున రావాలె, అదుగో బావ పెండ్లి అయింది... బావకు పెండ్లి అయింది... నేచెప్పలా... బావకు పెండ్లి అయింది.

("పిల్లలంతా చేరి కిలాకిలా నవ్వుతారు".)

జయ పాడుతుంది.

అయిందమ్మా అయిందీ
బావకు పెండ్లీ అయిందీ
మేళంతాళం లేకుండా,

దమ్మిడీ ఖర్చు లేకుండా
పెద్ద పెళ్ళి అయింది,
నాన్నక్కోపం వచ్చిందీ
నాలుగు తన్నులూ తన్నాడూ,
అయిందమ్మా అయింది
బావకు పెండ్లి అయిందీ.

"అంటూ ఎగురుతుంది"

(తె ర ప డు తుం ది.)

స ం పూ ర్ణ ము